GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౮] జనవరి 1955 [సంచిక ౧

# విషయసూచిక





సంక్రాంతి సందడి




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# మరొక సంపుటం-సంక్రాంతి

ధన, ధాన్య, వస్త్ర, వస్తువాహనాలతో శోభిల్లే యీ సంక్రాంతితో బాటు 'గృహలక్ష్మి' మరొక సంపుటంకూడ ప్రారంభమయింది. ఈ సందర్భమున యింత కాలమునుండి అభిమానించి సహకరిస్తూవచ్చిన రచయితలకు, రచయిత్రులకు, పాఠకులకు మా కృతజ్ఞతను వెల్లడిస్తున్నాము.

పూజ్యబాబు కేసరిగారి ఔదార్యాన్ని స్మరిస్తూ మీ ఆదరాభిమానములను చేయూతగా తీసికొని మిమ్ములనీ సందర్భమున అభినందిస్తున్నది 'గృహలక్ష్మి'.

'గృహలక్ష్మి' గతచరిత్ర మహోజ్వలమయింది. ముందుముందుకూడ అలాగే యుండి మరింత ప్రజోపయోగంగాను, ఆకర్షణీయంగా వెలువడుటకు మరింతగా మీ సహాయ సద్భావములు కావలసియున్నవి. ఈ బాధ్యతను మీరు మేము వహించవలసిన ఆవశ్యకత విశేషము.

ప్రజలలో విజ్ఞాన, వినోద వికాసాల వ్యాప్తికి గృహలక్ష్మి చూపుతున్న ఉత్సాహసక్తులను యావదాంధ్ర ప్రజానీకం గుర్తించినదనే మా విశ్వాసము.

# సంగీతము - సాహిత్యము

సంగీతము, సాహిత్యము ఒకదాని ననుసరించవలసినది మరొకటి. సంగీతము ఒక కళగా సర్వతోముఖంగా వర్ధిల్లడానికి భావరస పోషణము మూలాధారము. శాస్త్రసమ్మతమయిన అన్ని లక్షణాలతోబాటు భావరస పోషణలకు ఏప్రాంతాని కాప్రాంతము తన స్వభాషను అమలునందుంచడం సహజం. కాని అంతమాత్రంచేత ప్రాంతీయభాషా వైషమ్యాలు గానకళా పురోభివృద్ధిని పరిమితంచేయడంకాని, నిరోధించడముకాని కూడనిపని.

త్యాగరాజు, దీక్షితులు, శ్యామశాస్త్రిలాంటి వాగ్గేయకారులు తెలుగు సాహిత్యాన్ని సృష్టించి, స్వయంగాపాడి తమిళ ప్రాంత్యములో సయితము ఆదరాభిమానములకు పాత్రులైనారంటే రసికులు ఆంధ్ర, తమిళభాషా విభేదాల కతీతులుగానుంటూ కళావికాసానికి, వ్యాప్తికి దోహదమయినారు. అంతమాత్రంచేత తమిళ సాహిత్యము ప్రోత్సహించబడలేదని చెప్పలేము. అనాదినుండి తమిళసాహిత్యము అన్ని రంగాలలో వలె గాయకలోకంలోకూడ నిరాఘాటంగా పురోభివృద్ధి గాంచుతూవచ్చింది. కంబర్, అవ్వయార్‌లాంటివారు భక్తిపారవశ్యంతో పాటలు వ్రాశారు, పాడారు కూడాను.

తెలుగుపాటలు తమిళ ప్రాంత్యములోగాని, తమిళపాటలు తెలుగు ప్రాంత్యములోగాని వినడానికి రసికులున్నంతకాలం ఒక ప్రాంతీయ భాషను మరొకరు పహాస్యంగా మాట్లాడటం విశాలదృష్టి లోపమేకాగలదు.

---

# నమస్సు

శ్రీ ఘోరకవి రాజేశ్వరరావు

శ్రీపతి పెందొడన్ వెలుగు చిన్మయమూర్తివి నీవు, నేడు మా
పాపపు పుంజముల్ వెలికి పారగద్రోసి యశస్సుగూర్పగాన్
యీపగిదిన్ చెలంగుచును, యింతుల పాలిటి కల్పవృక్షమై
వ్యాపకమొందుచున్న చెలివౌ "గృహలక్ష్మి" నమస్సులమ్మరో!




## 'నారపీచు'

ప్రజాస్వామ్య పక్షాలైన కాంగ్రెస్, ప్రజా, కృషి కార్‌లోక్ పార్టీలు రానున్న ఆంధ్ర రాష్ట్రంలోని శాసనసభా ఎన్నికల సందర్భమున ఒకే కార్యక్రమానికి, ఒకే నాయకత్వముక్రింద పనిచేయడానికంగీకరించి సమిష్టిగా వెలువరించిన ఎన్నికల ప్రణాళిక తృప్తికరంగా నున్నదనియే చెప్పాలి. గాంధీజీ సూత్రాలననుసరించి జాతీయ సిద్ధాంతాలద్వారా దేశాభ్యుదయ సాధనకెంతైనా అనువైనదిగా నున్నది. ఇందులో పేర్కొనతగినవి — భూ సంస్కరణలు, రైతుకూలీలకు రక్షణ, మద్యనిషేధ విధానము, కుటీరపరిశ్రమలు.

ఈ సందర్భమున రైతులకు, వ్యవసాయకూలీలకు సంకల్పించిన రక్షణ కుటీరపరిశ్రమల అభివృద్ధి, విద్యాసంస్కరణలు, ఇరిగేషన్, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుల సత్వర నిర్మాణం, యితోధికంగా వైద్యసౌకర్యాలు, అవినీతి నిర్మూలనకు తగుచర్యలు హర్షించతగినవి.

కాని మద్యనిషేధ విధానము సవరణకు డెమాక్రాటిక్ ఫ్రంటు తలపెట్టినది మాత్రము సమర్థనీయంకాదు.

రాష్ట్రం మొత్తంమీద కల్లుగీతవారిని యితర సామాన్య ప్రజానీకంతో పోల్చిచూచినచో బహు కొద్దిమంది. ఈ బహు కొద్దిమంది కష్టనిష్ఠురాల నుద్దేశించి మద్యనిషేధ విధానమును సవరించి అశేష సామాన్యప్రజానీకపు ఆరోగ్య సౌభాగ్యాలను మంటకలుపనెంచుట ఏపాటి సబబు కాగలదో ఆలోచించ తగినది. పైగా మద్యనిషేధం మూలంగా కల్లుగీతవారు ఆర్థికంగా గిజగిజ లాడుతున్నారనడం సత్యదూరమైన విషయము. కల్లుగీతవారందరు మద్య విక్రయము మూలంగానే జీవనం గడుపుతుండలేదు. కొందరు భూస్వాములుగా, కొందరు వ్యవసాయ కూలీలుగా, మరికొందరు తోటలు, దొడ్లు కలిగియుండి పండ్లు, కాయగూరలులాంటి వ్యాపారస్తులుగా నుంటూ కల్లుగీతను, మద్యముల విక్రయాన్ని సాగిస్తుండేవారు. ఏ కొద్దిమందో నిజంగా మద్యపాననిషేధం మూలంగా కష్టనష్టాలకు గురియైనా వారిజీవనోపాధికి ప్రభుత్వము యితరత్రా సదుపాయాలు చేయడమో లేక వారే వ్యవసాయ కూలీలుగనో లేక మరేవృత్తులనైన అవలంభించుటమో వాంఛనీయంకాని వారికొరకని జాతీయ శ్రేయస్సును బలియిచ్చుట గొప్ప పొరబాటు కాగలదు.

*　　　*　　　*

డెమాక్రటిక్ ఫ్రంట్ నిర్మాణంతో ఆంధ్రలోజరుగబోయే ఎన్నికలలో కమ్యూనిస్టుల పతనానికి అంకురార్పణ జరిగినట్లేనని శ్రీ నీలం సంజీవరెడ్డిగారంటున్నారు. జాతీయవాదుల సయితం అధిక సంఖ్యాకులు సంతోషాంగీకారాలను వెల్లడి చేస్తున్నారు. ప్రకటింపబడిన అభ్యర్థుల జాబితాలో మహిళలనుగూడ నిర్ణయించడం సంతోషకరమైన విషయము.

♦　　　♦　　　♦

రాజమండ్రి సభలో ప్రొఫెసరు సాంబమూర్తిగారు ఉపన్యసిస్తూ "సంగీతములో కళాసంగీతము, దైవిక సంగీతము, గేయసంగీతము, నృత్యసంగీతము, జానపద సంగీతము మున్నగునవి యున్నవి" అన్నారు. వారు యింకా భారతీయ సంగీతకళయొక్క విశిష్టతను

గురించి వివరిస్తూ విశ్వవిద్యాలయాధికారులు బి. ఎ., ఇంటర్ మీడియేటు తరగతులలో ప్రతి కాలేజిలోను సంగీతాన్ని పాఠ్యవిషయంగా చెయ్యాలనియు, హైస్కూళ్ళలోను, ట్రైనింగు స్కూళ్ళలోనుగూడ సంగీతాన్ని ప్రవేశపెట్టాలని సూచించారు.

శ్రీ సాంబమూర్తిగారు ఉత్తమ విద్వాంసుడు, అనుభవజ్ఞుడు. వారి సూచనలు గానకళ ఆంధ్ర ప్రజానీకంలో విస్తరించడానికి తోడ్పడగలవనియు, విశ్వవిద్యాలయాధికారులు వారి సూచనలను శ్రద్ధతో పరిశీలించి తగు ఏర్పాటులు చేయగలరని ఆశిద్దాము!

♦ ♦ ♦

గాంధీజీనాయకత్వముక్రింద జరిగిన జాతీయ పోరాటములోని ప్రధానలక్ష్యాలు రాజకీయ స్వాతంత్ర్యము, సాంఘిక న్యాయము, అంతర్జాతీయ తగాదాల శాంతియుత పరిష్కారము. ఇందులో మొదటిదానిని సాధించాము. రెండవది యింకా సాధించవలసి యున్నది. అంతర్జాతీయ తగాదాల శాంతియుత పరిష్కారానికి ఇండియా చూపుతున్న ఆసక్తిని ప్రపంచదేశాలన్నీ ప్రసంశిస్తున్నవి. ప్రపంచంలో అనేక దేశాలలో మన దేశానికి విశేషఖ్యాతేకాక ప్రపంచంలోశాంతి సౌభాగ్యాల విస్తరణకే మనదేశము మూలాధారమనినమ్ముతున్నారు. కాని దానివల్ల మనదేశములో సాంఘిక న్యాయము సాధింప కలుగనంత కాలము పురోభివృద్ధికి చిహ్నము కానేరదు. సాంఘిక న్యాయమంటే తర, తమ అనే ప్రసక్తిలేకుండా ఉన్న అవకాశాలను, హక్కులను, బాధ్యతలను సమానంగా ప్రజానీకం అనుభవించకలిగి శాంతియుత సహజీవనమునకు అలవాటుపడగల అవకాశం. ఇట్టి న్యాయమును సాధించడానికి ఏ ఒక్క తెగ పూనుకొన్నంత మాత్రాన చాలదు. ప్రజానీకం ఉమ్మడిగా విశాలహృదయంతో తమలో తాము సానుభూతి, సహకార, సహాయాల నలవరచుకొనుటవలన యీ న్యాయము సులభంగా సిద్ధించగలదు. దీనికి దోహదముచేసే ప్రతివ్యక్తి ప్రజాహితుడే.

♦ ♦ ♦

గ్రామోద్యోగులైన మునసబు, కరణాల యొక్కయు, నౌకర్లయొక్కయు జీతములను పెంచాలనియు, యస్. జి. ఓలకు గల ఉచితవిద్యా, వైద్య సౌకర్యాలను వారి పిల్లలకు లభ్యము కావలెననియు తూర్పు గోదావరిజిల్లావార్షిక గ్రామోద్యోగుల సమావేశంలో ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించబడింది.

గ్రామాధికారుల బాధ్యతలు భారత రాజ్యాంగానికి జీవకర్రలాంటివి. గ్రామ పరిపాలనా యంత్రాన్ని మరింత పటిష్టంగా, ప్రజోపయుక్తంగా చేయుడానికి గ్రామాధికారులను ప్రోత్సహించవలసి యున్నది. జీవనవ్యయం పెరిగిన యీ రోజులలో గ్రామోద్యోగులకు రు. 60/-లు గాను, నౌకర్లకు రు. 30/-లు గాను జీతముల పెంచవలసినదిగా కోరడం అతిశయ మేమి కాదు.

♦ ♦ ♦

ఆటంబాబులను సముద్రంలో కుమ్మరించమని రాజాజీ ఒకచోట చెప్తే విజ్ఞానశాస్త్రలక్ష్యము సాంఘిక ఆర్థిక అభివృద్ధియని మధ్యప్రదేష్ ముఖ్యమంత్రి శ్రీ రవిశంకరశుక్ల అన్నారు. అంటే విజ్ఞానశాస్త్ర పరిజ్ఞానం మానవ సమాజానికి నిర్మాణ కార్యక్రమాలలో తోడ్పడాలికాని విధ్వంసమునకు కాగూడదనే వారిద్దరి భావము.

♦ ♦ ♦

ఆచార్య రంగాగారు ధాన్యం ఉత్పత్తిదారుల మహాసభకు అధ్యక్షత వహించి 'రైతులు దెబ్బతినకుండా పంటల ధరలు నిర్ణయించాలి' అని ప్రభుత్వానికి విజ్ఞప్తిచేశారు. బాగానేయుంది – రైతులు దెబ్బతినకూడదు; కూలీలు దెబ్బతినకూడదు. అయితే మరి మధ్యతరగతి ప్రజాసామాన్యమో! – చాలీచాలని ఆదాయంతో కొనుగోలుశక్తి క్షీణించి ఆర్థికంగా గిజగిజలాడుతున్న మధ్యతరగతి కడగండ్లను ఆచార్య రంగాగారుగాని, ప్రభుత్వంకాని గుర్తించడం లేదు

సంపన్నులకు ధరలు గరిష్టమయినా లక్ష్యంలేదు. కూలినాలి చేసికొని జీవించేవారికీ లభించేఆదాయంతో అవసరాలను తీర్చుకోడానికి అలవాటు పడినారు. ఇక మిగిలిన మధ్య తరగతివారే-ఉట్టికి స్వర్గానికెక్క లేక తమ ఆర్జనకు, బజారులోని ధరలకు సంబంధంలేక చిత్తయిపోతున్నారు.

ఉత్పత్తులు ధరలుతగ్గకుండా యుండాలంటే ప్రజా సామాన్య మొత్తంమీద ఆదాయం దాని ననుసరించి స్థిరపడాలి. ఆదాయము నిలకడలేకుండా, నిరుద్యోగంతో గిజగిజలాడుతున్న సామాన్య ప్రజానీకానికి రక్షణపట్ల ఆసక్తి చూపకుండా ఏ ఒక్క వర్గానికో రక్షణకై విజ్ఞప్తులు చేసినా ఫలితములు ఆశాజనకంగా నుండవు.

♦ ♦ ♦

బీహార్ గవర్నర్ శ్రీ ఆర్. ఆర్. దివాకర్ గారు అఖిలభారత విద్యామహాసభ వార్షికోత్సవమును ప్రారంభిస్తూ ఉపాధ్యాయుల ఆర్థికావసరాల విషయమై సానుభూతితో ఆలోచింపవలసిన అవసరం కలదంటూ, ప్రాథమిక విద్యాబోధనను స్త్రీలే నిర్వహించడం మంచిదనే అభిప్రాయాన్ని వెల్లడించారు.

ప్రాథమిక విద్యాబోధనను స్త్రీలు నిర్వహించినంత ఓర్పుతో సమర్థంగా పురుషులు నిర్వహించలేరు. బాలబాలికలలోని లావణ్యాన్ని, సున్నితమయిన మేధాశక్తిని పోషించి, విద్య, విజ్ఞానములను స్త్రీలు చాకచక్యంగా గరుపగలరు. ఈ సందర్భమున శ్రీ దివాకర్ గారి అభిప్రాయము ముమ్మాటికి ఆచరణ యోగ్యము. అంతేకాక ఉపాధ్యాయుల ఆర్థికావసరాల విషయమై సానుభూతితో ఆలోచింపవలసిన అవసరం కలదని వెల్లడించిన అభిప్రాయాన్ని ప్రజలు, ప్రభుత్వముకూడ గుర్తించాలి!



# నిమ్మకాయ - గుణములు

నిమ్మకాయ రసము, సోడాపొడుము, పంచదారతో కలిపి త్రాగిన యెడల జీర్ణకోశములోని మంట, నొప్పి, గుండెలో మంట తగ్గును.

నిమ్మకాయ పై చర్మములోని రసము, హారతి కర్పూరము కలిపి యిచ్చిన గుండెలోని మంట నొప్పి తగ్గును.

నిమ్మకాయ పైచర్మములోని రసము చేదుగనుండును. ఈ రసము జీర్ణకోశమును బలపరచి ఆకలి పుట్టించును. శూలల నివారించుటకు చాల మంచిది.

నిమ్మకాయను ముక్కలుకోసి, ఒక దారమునందు గ్రుచ్చి, యెండబెట్టి, బాగుగా యెండిన పిదప మెత్తగా చూర్ణముచేసి దానికి ¼ రెట్లు పంచదార కలిపి పావుతులం ఉదయం సాయంకాలం సేవించిన కడుపుబ్బుట వగైరా సమస్త ఉదర రోగములు నశించును.

మరువాడ వెంకట రమణమ్మ

# సంక్రాంతిలక్ష్మి

శ్రీమతి గుడిపూడి రాజేశ్వరీదేవి

చల్లన్ని మాతల్లి సంక్రాంతి వచ్చింది
తెల్లవారేలేవవే నాతల్లి యిల్లలికి ముగ్గ
ట్టవే
చిలుకలా కొల్కిరో సీతమ్మ పలుకమని
చిరుగజ్జ మ్రోయంగ – హరిదాసు
లొచ్చారు
గొబ్బెమ్మ లేబెట్టవే నాతల్లి – కొసరి
ముగ్గులె వేయవే ॥ చ ॥

మాలతీ సంపెంగ – మరుమల్లె చేమంతి
నందివర్ధనజాజి – నైట్‌క్వీను పగడాల
విరులమాలలు గ్రుచ్చవే నాతల్లి నెరికురుల
గీలింపవే ॥ చ ॥

బసవన్న డూ, డూ, డు – భాగ్యాల తల్లులని
గంగిరెద్దులబాబు – కలకలము జేశేను
వంగమెరపల బెట్టవే నాతల్లి, రంగుకోకల
నీయవే ॥ చ ॥

క్రొత్త అల్లుడదేమో – కోరమీసముదువ్వి
పాలయక్కలనుబూని – పోయిమంచము
ఎక్కె.
ఏల అలిగెనో అడుగవే నాతల్లి – ఏమి
కోరునో దెలుపవే ॥ చ ॥

పాలబుగ్గలపాప – పకపకా నవ్వుచూ
నట్టింట సిరులతో – నాట్యమాడుచూ
తిరుగు
భోగిపండ్లనుబోయవే నాతల్లి భోగ
భాగ్యము లందవే ॥ చ ॥

కలవారి పాపలూ – కళలొలుక బొమ్మలకు
పెండ్లిండ్లుజేయుచూ – పిలిచేరు పేరంటం
ఆనందమానందమే నాతల్లి – అంతటా
సౌభాగ్యమే ॥ చ ॥

పల్లెల్లో మహాలక్ష్మి – పైరుపంటలవిరిసి
కలకలాలాడుచూ – కల్యాణవతియాయె
గోమాత పూజింపవే నాతల్లి కోరిశుభ
ముల బొందవే ॥ చ ॥

సంక్రాంతి నెలలాగ సాలుసరి యీలాగే
భాగ్యాలవల్లిగా – భారతా భూమెల్ల
శోభింపగాకోరవే – నాతల్లి – సౌఖ్యాన
జీవించవే ॥ చ ॥



సంక్రాంతి సందడి

# వంశాంకురము



శ్రీ సి. సి. పున్నయ్య

"ఏమిటి బావా! చేతిలోది — ఏదో క్రొత్త పుస్తకములాగుందే" అంటూ పుస్తకమును లాక్కొని పోయింది రాణి.

నేను ఏదో పనియుండి లేచి వెళ్ళిపోయాను.

రాణి ఆ పుస్తకాన్ని చదవడం మొదలుపెట్టింది.

"నాకు వివాహమయి కాపురానికెళ్ళి అయిదారు సంవత్సరాలు పైగా అయింది. మా అత్తింటివాళ్లు సంపన్నులు. మామగారు చనిపోయి చాలాకాలమయినా మా అత్తగారు జాగ్రత్తగా సంసారాన్ని దిద్దుకొనివస్తూ యిద్దరుఆడపిల్లలకు పెళ్ళిళ్ళుచేసి కాపరానికి పంపేసింది. ఆమె అనుదిన పూజలు, వ్రతాలు దానధర్మాలు ఆ యింటిని నిత్యకళ్యాణం, పచ్చతోరణంగా రాజిలజేస్తుండేవి. పేదసాద ఆమెయెడల అత్యంత భక్తివిశ్వాసాలతో వ్యవహరిస్తుండేవారు. కాని ఆమెకు ఒక పెద్దకొరత — అది మాకు వివాహమయి అయిదారుసంవత్సరాలు గడచినా వంశాంకురం కాగల సంతానం మాకు కలుగకపోవడం.

మావారు చాలా మంచివారు. వారికి నామీదగల ప్రేమ అవ్యాజమైనది. సంతానములేని కొరత మా అత్తగారికేకాదు: మాకూయుండేది. కంటబడిన పసిపాపనల్లా ఎత్తుకొని ముద్దాడి మిఠాయీలు, బొమ్మలు కొనిపెట్టేవారము. అంతమాత్రంచేత పరాయివాళ్ళ బిడ్డలు మా బిడ్డలగుతారా! మేము సంతానం కొరకని వేయిదేవుళ్ళకు మ్రొక్కేవాళ్ళము. మేము పుణ్యనదులలో చేసిన స్నానాలు, మేము సేవించిన దేవాలయాలు లెక్కకు మించినవి. కాని వాని ఫలితం నిస్పృహనిరాశలైనవి. మా అత్తగారు నాకు ఎప్పుడు కొద్దిగా సుస్తిచేసినా నెల తప్పిందేమోనని ఆశపడి, నిరాశకాగానే చీకాకుపడేది. క్రమంగా ఆమెకు ఓర్పు తగ్గిపోయి సంతానంకొరకు మరొక వివాహం చేసికొనవలసినదిగా మావారి చెవులు కొరకసాగింది. కాని నన్నెంతగానో ప్రేమిస్తున్న మావారు అందుకు సుతరాం సమ్మతించలేకపోయారు. ఊళ్ళోని వాళ్ళు కొందరు మాపట్ల సానుభూతితో విచారం ప్రకటించేవారు. మరికొందరు మాకు సంతానం లేకపోవడంవలన శుభకార్యాలలో మా యునికి అపశకునంగా భావించి మమ్మలను పిలవడానికి సంకోచించేవారు.

ఒకరోజున ఉదయం మా యూరి ప్రక్కనున్న భువనేశ్వరాలయానికి ఈశ్వరార్చనకు వెళ్ళాము. వందలాది ప్రజలు భగవంతుడనుగ్రహించినందుకుగాను మొక్కుబళ్లు తీర్చుకుంటున్నారు. అందులో ఎందరో తల్లుల చేతుల్లో పసిపాపలు క్యావ్ క్యావ్మంటున్నారు. వారి ముఖాలపై సంతోష సంభ్రమాలు, భక్తి విశ్వాసాలు తొణికిసలాడుతున్నవి. ఇందరిని అనుగ్రహిస్తున్న భువనేశ్వరుడు మమ్మలను అనుగ్రహించి సంతానమివ్వకపోవడానికి మేముచేసిన మహాపచారం ఏమియులేదే అనుకుంటూ అర్చన ముగించుకొని యింటిముఖం పట్టాము. దారికిరువైపుల మామిడిచెట్లున్నవి. ఆ చెట్లనీడన బాలబాలికలు ఆడుకుంటున్నారు. వాళ్ళకు దేవుడిప్రసాదం పిలిచిపెట్టాము. వారిలో ఒకడుమాత్రం ప్రసాదం తీసికోకుండా తొలగితొలగి పోసాగాడు. మాకు ఆశ్చర్యమేసింది. అందరూ ప్రసాదంకొరకు ఎగబడుతుంటే ఆ కుర్రాడు మాత్రం తొలగితొలగి పోవడమునకు కారణమేమిటాయని ఆలోచింపసాగాను—

"ఏం బాబూ! ప్రసాదం ఎందుకువద్దు? రా — వచ్చి పుచ్చుకో" అన్నాను.

వాడు మరి నాలుగడుగులు వెనక్కు వేశాడు. నేనుపోయి బ్రతిమాలి ప్రసాదం పెట్టాలని పట్టుకొని ప్రయత్నించాను. కాని తప్పించుకొని పోవడానికి పెనుగులాడసాగాడు. నేను ఎంతో బుజ్జగించి, బొమ్మలు, మిఠాయిలు కొనిపెడ్తానని ఆశపెట్టేసరికి

"మా అమ్మ, నాన్న మీదగ్గరికి పోవద్దన్నారు" అన్నాడు. నేను అప్రయత్నంగా "ఎందుకు..." అన్నాను.

"మీకు బిడ్డపాప లేరట మీరు..." అనేసరికి నా చేతులు పట్టుతప్పినవి. పిల్లవాడు తప్పించుకొని పారిపోయాడు. నేను కుప్పకూలినట్లు కూలిపోయేసరికి మావారు మెల్లగా పట్టుకొని యిల్లుచేర్చారు.

ఆనాటినుండి ఆ యూరి వాతావరణం నాకు ప్రాణ కంటకమయింది. నన్ను, నాదీనావస్థను చూస్తున్న మావారు యిక ఆవూళ్ళోనుండి లేచిపోయి ఏకాననీ దేశంలోనో స్థిరపడితేతప్ప ప్రశాంతమయిన జీవితముండదని నిర్ధారణ చేసికున్నారు. కాని ఇల్లు వదలడానికి ఒక్కడే కొడుకైన మావారిని తల్లివదలి యుండడానికిచ్ఛగించదు. ఇక మరిచేసేది — కాశీకి తీర్థయాత్రకువెళ్ళి వస్తామని బయలుదేరివెళ్ళి రెండు వందలమైళ్ల దూరంలో నున్న మద్రాసు నగరానికిచేరి కాపరం పెట్టాము. మావారు ఒక ఆఫీసులో మేనేజరుగా ఉద్యోగానికి చేరారు. అలా రెండుసంవత్సరాలు గడిచింది. ఆలోపల నేనుకాని, మావారుకాని ఎవరికి జాబులు వ్రాయలేదు. కాబట్టి మా అత్తగారికి సయితం మాయునికినిగురించి తెలియకుండాయుండింది.

ఒకరోజున ప్రస్తాపనవశంగా తమకు బిడ్డలులేని కొరతనుగురించి మావారు తన ఆప్తమిత్రుడు డాక్టర్ రమేష్‌బాబుతో చెప్పాడు. అందుకాయన వెంటనే మావారిచేత మా అత్తగారికి "సీతకు నవమాసములు నిండినవి_రేపు మాపట్లో మనుమడో, మనుమరాలో" అని వ్రాయించాడు.

మా అత్తగారు ఉప్పొంగిపోయింది. పురుడు పోయడానికి వస్తున్నానని తిరుగు జబాబు వ్రాసింది.

కాని మేము వెంబడే ఆమెను రావద్దనీ, మేమే అన్నప్రాశనకు అక్కడికి వస్తున్నామని వ్రాశాము.

రమేష్‌బాబు చెల్లెలు ప్రసవించి మొగశిశువును కనింది. ఆమెను అప్పటికే గుంపెడు బిడ్డలుండి నానా యాతనలు పడుతుండుటవలన అన్న చెప్పినట్లు పుట్టిన బిడ్డను మాకిచ్చేసింది. మేమే పాలు, నీళ్లుపోసి పెంచసాగాము. ఆరవనెలరాగానే పిల్లవాణ్ణి తీసుకొని అన్నప్రాశనకు స్వగ్రామానికి చేరాము. మా అత్తగారు పిల్లవాణ్ణి ఎత్తుకొని పరమానందభరితురాలయింది. అన్నప్రాశననాడు మా యింటికి వచ్చిన బంధుమిత్రులు మమ్ముల నభినందిస్తుంటే మా అత్తగారు పిల్లవాణ్ణి ఎత్తుకొని సగర్వంగా అభినందనాశీస్సులను స్వీకరించింది.

ఊళ్ళోవాళ్ళు, చుట్టాలు, పక్కాలు ఆ పిల్లవాడు మా బిడ్డడనే అనుకొంటున్నా, మా అత్తగారు మాత్రం పిల్లవాడికి నేను పాలివ్వకపోవడం అప్పుడప్పుడు కొంత సదేంహానికి కారణమయినా! యిప్పటి కాలపు తల్లులు అంతేకాబోలు ననుకొని తృప్తిపడేది.

నేను భోంచేస్తుంటే రాణి పరుగెత్తుకుంటూవచ్చి "నారపీచుగారు కథలుకూడా వ్రాస్తున్నారే" అన్నది ప్రక్కనకూర్చుని.

"నీబోటి జీరంగి చదవడానికుంటే ఎందుకు వ్రాయడూ" అన్నాను నేను.

రాణి గట్టిగా గిల్లి పారిపోయింది.

— — (0) — —

ఒకాయన టెలిఫోనులో పోలీసు ఉద్యోగితో "ఏమండీ! నా భార్య పరారైపోయింది - ఏమిచెయ్యమంటారు" అని అడిగాడు.

పోలీసు ఉద్యోగి "ఆమె పోలికలు, ఎప్పుడు పరారియైపోయినది చెప్పండి."

"ఆమె అయిదు అడుగులఎత్తు, సన్నగా, మెల్లకన్నుతో నుంటుంది. పరారియై రెండు వారములయింది."

"ఇంత కాలం ఎందుకు రిపోర్టుచేయలేదు"

"ఈ రెండు వారాలు అది కలయేమోననుకున్నాను.

# కుమారి శకుంతల

మద్రాసు నగరంలో సుప్రసిద్ధ విద్యావేత్త, చిల్డ్రెన్స్‌గార్డెన్‌స్కూలు ప్రధానాచార్యుడు డాక్టర్ వి. యన్. శర్మగారి కుమార్తె. డిశంబరు 17-వ తేదిన రసికరంజని సభ హాలులో యీమె ప్రదర్శించిన భరతనాట్యభంగిమములు ప్రేక్షకుల నానంద పరవశులను చేసినవి. భావ, రాగ, తాళయుక్తమగు కుమారి అభినయకౌశలమును ప్రేక్షకులలోని పురప్రముఖులు శ్లాఘించి అచిరకాలంలోనే ఉత్తమశ్రేణిని చేరుకొనగలదని ఆశీర్వదించారు. ఆమెకు చక్కని శిక్షణనిచ్చిన శ్రీమతి ధన మాణిక్యమ్మ గారికృషి ప్రశంసనీయము.



కుమారి శకుంతల, శ్రీమతి ధన మాణిక్యమ్మ గారలు

పాత్రపోషణతో బాటు వేషధారణ సయితము చక్కగా నొప్పి యుండుటచే నృత్యప్రదర్శనము మరింత రాణించింది.

అభ్యుదయ నర్తకిగా కుమారి శకుంతలకు సకలకళాశాలతో బాటు ఆయురారోగ్య సౌభాగ్యాలను భగవంతుడు ప్రసాదించుగాక !

# తాతయ్య ప్రహసనం

శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్య శర్మ

(గతసంచిక తరువాయి)



[బుద్ధిలేని మహారాజు ఆస్థానంలో సన్మాన సందర్భమున భావకవుల పోకడలను, పాండిత్యాన్ని విమర్శిస్తూ స్వజాతీయతను, వాఙ్మయాన్ని, సంస్కృతిని అర్థంచేసికోక దారి డొంకలేని వ్రాతలు వ్రాసేవారు భావ కవులని మంత్రి వారికి ఒక్కొక్కరికి ఒక్కొక్క కద్దరుశాల్వ బహూక రించునట్లుగా ఉత్తరవులు జారీచేసి పొమ్మన్నారు - యిక చదవండి]

(5 వ రంగం)

మం:-అసలైన విమర్శకులు రండి — ఓఆగస్త్యభ్రాత విమర్శకాగ్రేసరవర్యా! నీ వర్కులో మెరిట్ చెప్పు.

అ. వి.:—అయ్యా! మీదగ్గర రహస్య మెందుకు? నేను చేసిన విమర్శలన్నీ దొంగ రకంగానే ఉన్నాయి — నేను ఓ చిన్న ఉద్యోగంలో ఉండే వాణ్ణి. వీధి భాగవతం వేషాలు వేస్తూ వుదరపోషణ చేస్తూండేవాడను. ఓ తెలుగు పండిత పదవికి అప్లి కేషన్ పెట్టాను. నీవేమి చదివినావన్నారు? నేను పాటలు బాగా పాడగలనని చెప్పాను. ఆ దివాన్‌గారు పాటలతో పిల్లల అల్లరిలేకుండా చూడగలడనిన్నీ, తెలుగు చెప్పడానికి ఏమీ చదవకపోయినా, ఇబ్బందిలేదనిన్నీ ఆ చిన్న ఉద్యోగం నాకివ్వవచ్చని, మాఅవ్వ వంటలక్క పనికి మెచ్చుకొని నాకా వుద్యోగం ఇచ్చారు. దరిమిలాన నేను కొంచెంకొంచెం చదువుకోడం ప్రారంభించాను. పెద్ద ఉద్యోగంకోసం అప్లైచేసాను — పాతదివాన్ మారేడు — క్రొత్తదివాన్ నా అప్లికేషన్‌చూచి నీ వేమేని గ్రంథాలు వ్రాసేవా అన్నాడు. నేను నిత్యం అబద్దం ఆడ్డానికి జంకే వాణ్ణికాదు కనుక "వ్రాసేనండి" అన్నాను. అచ్చు వేయించావా అన్నాడు. దరిద్రుణ్ణి కాదా అండి అన్నాను. అయితే వ్రాత ప్రతి తీసుకురా అన్నాడు దివాన్. నెలరోజుల టైమ్ అడిగేను. వారంకన్నా ఎక్కువ ఈయన న్నాడు. సరేలెండి తెస్తానన్నాను. ఇంటికి వచ్చాను. ఏమీ దిక్కుతోచలేదు. పుస్తకాల బీరువా తీసేను. అందులో ఓ ఓల్డు ఎం. ఏ. వ్రాసిన కావ్య విమర్శ అనే గ్రంథం దొరికింది. చాలనుకొని, కుర్రాళ్ల కాంపోజీషన్ పుస్తకాల లోని తెల్లకాగితాలన్నిచించి, వాటిమీద ఆ పుస్తకాలలోని ఆఖరధ్యాయాన్ని మొదటి అధ్యాయంగాను, మొదటిఅధ్యాయాన్ని ఆఖరధ్యాయం గాను, మొదటి పేరాని ఆఖరు పేరాగాను, ఆఖరు. పేరాని మొదటి పేరాగాను — ఆ గ్రంథంలో అవును అనే క్రియకు బదులు కాదు అనీన్నీ, కాదు అనే క్రియకుబదులు అవును అనిన్నీ గబగబ వ్రాసి 4 రోజులకే దివాన్‌గారికిచ్చేశాను. ఆ దివాన్‌గారు కడకంటా నా చేతనే చదివించారు. ఆయనకు తెల్గులో అఖండ పాండిత్యం ఉందిట. అది నాకు తెలియదు — ఆ సంగతి నాకు మొదట తెలియకుండపోవడం చాలా వుపయోగించింది. ఆ ఓల్డు ఎం. ఏ. గారు యీ దివాన్‌గార్కి తెల్గు లెక్చరర్‌గా ఉండేవారట. ఆ లెక్చరర్‌గారిని మా దివాన్‌గారు చదివే రోజుల్లో ఏడిపిస్తూండేవారట. కొంత కాలానికి

ఆ లెక్చరర్ బి. ఏ. కి ఎగ్జామినర్ అయ్యేట్ట. మన దివాన్‌గారు ఆ ఎం. ఏ. గారి చేతుల్లో పడ్డాడు. ఫైల్ చేసేడు. ఆ మూడేళ్లూ మన దివాన్‌గారు బి. ఏ. తెల్గు ప్యాస్ కాలేకపోయినారు. ఈ కసి ఉన్నట్లు నాకు తెలియదు. నేను యాదాలాపంగా కంటపడిన ఆ పుస్తకాన్ని దొంగకాపీ చేసితీసికెళ్లే సరికి, మాదివాన్‌గారు తమ లెక్చరర్ గ్రంథాన్ని ముక్కముక్కల క్రిందకి ఖండించానని పరమానంద భరితులై, నా పుస్తకాన్ని అచ్చు వేయించి, నాకా పెద్ద వుద్యోగం యిప్పించి, ఒక సన్మాన సభలో నాకు విమర్శకాగ్రేసర అనే బిరుదుకూడా ఇప్పించేరు - ఇది నా పాండిత్యం – (అని సత్యాన్ని చెప్పాడు).

మం:– నీయంత ధర్మమూర్తి, సత్య హరిశ్చంద్రుడు ఎప్పుడు ఉండడని మెచ్చుకొన్నాం. వెయ్యిన్నూటపదార్లు తీసికొండి. నిజం చెప్పినవారికల్లా వెయ్యిన్నూట పదార్లే ఇస్తాం.

(వి. అ– సన్మానంపొంది సభలోంచి తుర్రుమని యింటికి పోయినాడు)

మం:– తరువాతవారు.

చిటిమొటి శాస్త్రి:– అయ్యా ! మీరు మంచి మంత్రులు — నేనండి ఓ యూనివర్శిటీలో తెల్గు సామ్రాజ్యాధిపతిగా వుండేవాడను. పెద్ద పెద్ద పరీక్షలకు ప్రశ్నలను ఎన్నటికీ విడివడనివాటిని యిచ్చి, యిప్పించేవాణ్ణి. ఆ ఆన్సరు పత్రములు నేనే దిద్దడానికి తీసికొనేవాణ్ణి–కుర్రాళ్లు నాకంటె నా సహోపాధ్యాయులకంటె తెలివిగలవాళ్లు. కొందరు వ్రాసిన ఆన్సర్లు అన్నీ ప్రోగుచేసి ఓ గ్రంథంగా — పబ్లికేషన్‌లో ఉంచాను. నాకు తెలివి బండలు ఏడ్చి చావలేదు– ఇది నా చరిత్ర.

మం:– తీసికోవయ్యా వెయ్యిన్నూట పదార్లు.

చి. శా:– (తీసికొని సలాంచేసి కారెక్కి రివ్వుమన్నాడు)

మం:– తరువాతవారు.

తటుకుచెటుకు పంతులు:– అయ్యా ! నేను ఓ పల్లెటూళ్లో ఓ గొప్ప విద్వాంసునివద్ద చదువుకొనేవాణ్ణి. ఆయన శాస్త్రపండితుడైనా విమర్శనా పటిమ వున్నవాడున్నూ, చక్కని కవిన్నీ అవడం వల్ల పాఠాలు చెప్పడం, విమర్శనలు వ్రాయడం, కావ్యాలు వ్రాయడం విధీ విరామం లేకుండా వుండేవి. ఆ శాస్త్రపాండిత్యం నాకు అబ్బలేదు. కాని ఆ విమర్శనలూ ఆ కావ్యాలూ ఫేర్ కాపీ చేస్తుండేవాడిని. నాకు దస్తూరి బాగా కుదిరింది. నాతో చదువుకొనేవాళ్లల్లో చాలామంది శాస్త్ర పండితులు, కవులూ విమర్శకులూ అయిపోతూంటే నాకు విషంత్రాగి చావాలనిపించేది — ఓ రోజుని మా గురువుగారు పడకటింటిలోకి రాత్రి 12 గంటలకు వెళ్తూండగా నేను అడ్డంవెళ్ళి పోతున్నానండి అన్నాను. ఎక్కడికన్నారు. నాకు తెలియనిచోటికన్నాను. తెల్లారనీ అన్నారు. తెల్లారితే నేనుంటేగా అన్నాను. నీవు లేకపోతే చచ్చిపోతానురా అన్నారు. నేను వట్టి శుంఠకాయను గదాండీ అన్నా. అయినా సరే నీతో సమానమైన ఓపికగలవాళ్ళు ఎవళ్ళూ యింతవరకు పుట్ట లేదన్నారు. ఎంచేతనండీ అన్నాను. పట్టుదలతో నీవెంత పనేనా చేయగలవన్నారు. తెలివిలేని వెధవకి పట్టుదల వుంటేమాత్రం ప్రయోజనం యేంటండీ అన్నాను నీ దస్తూరి బాగుందిరా అన్నారు. నా దిస్తూరి మీకిచ్చేస్తున్నాను, నాకు మీరేమిస్తున్నారండీ అన్నాను. కావలిస్తే ఓ రెండు పుస్తకాలు తీసికో అన్నారు. నా పేరు పెట్టుకోనాండి అన్నాను. నిక్షేపంలా పెట్టుకో అన్నారు. మా గురువుగారి పుస్తకాలల్లో ఎక్కువ పేజీలుగా వుండే రెండు పుస్తకాలు నా పేరుతో అచ్చువేయించుకొని మా గురువుగారికే అంకితం చేశాను. ఇదండి నా పాండిత్యం. తరువాత తరువాత నా పేరు దిగంత విశ్రాన్తమైందండి.

మం:– కాశ్మీరు శాలువా. వెయ్యిన్నూట పదార్లు తీసికోవయా.

తటు.శాస్త్రి:-(సన్మానాన్నందుకొని పుటాయించేడు)

మం:- తరువాత వారు.

కంగారుశాస్త్రి ఎం. ఏ. గారు:- అయ్యా! నన్ను అందరూ ద్వేషిస్తారు. అసలు నేనుఎవర్నీ వంచించను. ఆ శక్తిలేదు. మా గురువులకు నాకూ ఎప్పుడూ విరోధమే. తెల్గు గురువులతోనే సుమాండి! అందులో యిద్దరు తెల్గు గురువులు ఎం ఏ. లు ప్యాసయినవాళ్లు, వాళ్ళిద్దరూ నా కంటె తెలివైనవాళ్లుకారు. క్లాసులో పాఠం చెప్తూంటే అలోలక్ష్మణా అని ఏడ్చుకొనేవాళ్లు. నా తడాఖాకి తట్టుకోలేక అందులో ఓ. ఎం ఏ గారు మహాగర్వి అండి. ఆయనకి చిన్నప్పటినుండి బేడ్ హేబిట్స్ అలవడ్డాయి. ఆయనకి కవిత్వం విమర్శన చేతనవునని, ఇతర్లకి ఆ రెండూ చేత కాదని క్లాసులో టప్పాలు కొట్టేవాడు. ఓ రోజుని ఆయన కవిత్వాన్ని చెప్పవల్సిందని క్లాసులో కుర్రాళ్లం పట్టుపట్టేం - అప్పుడాయన్ని వుంచుకొన్న వెలయాలుమీద కవిత్వం కట్టేడండి. అది ఆయనవుండే వీధిలోవున్న మా కుర్రాళ్ళకి కొంత బాగుగా అర్థం అయిందండి - దానికి పీఠిక, వ్యాఖ్య వ్రాసి అచ్చువేయించాం కుర్రాళ్ళం చందాతో. ఆ పుస్తకాలు మూడువేలు మా పట్టణంలోనే అమ్మేం. ఆ అమ్మకంలోవచ్చిన లాభం సొమ్ముతో ఆ ఎం. ఏ. గురువుగారికి సన్మానం చేసాము. దాంతో ఆ గురువుగారు నాకు సన్మాన సంధాన చక్రవర్తి అని బిరుదు ఇచ్చారు. ఆ బిరుదుకే నేను ఉబ్బిపోయి నా జీవితం యితరులకి సన్మానం చేయించడంతోటే గడుపుతూ వస్తూన్నాను. నాచే సన్మానం చేయించుకుపోయే ప్రతి పెద్దమనిషి వాడివాడి పద్యరచనలో కొంత, విమర్శలలో కొంత, చిన్నచిన్న ఖండ కావ్యాలలో కొంత, ఇచ్చిపోతూండేవారు. ఆ సామగ్రి అంతా నాదే అని కొన్ని కొన్ని సభలలో ప్రదర్శించి నేనూ కొన్ని కొన్ని సన్మానాలు పొందుతూవస్తూన్నాను. ఇది నా సంగ్రహ చరిత్ర.

మం:- మీ ఎం.ఏ.లుకూడా ముష్టికి బైయలుదేరేరేమి?

కం. ఎం. ఏ:- గతిలేక ముష్టికి బైలుదేరాం. మావు బి. ఓ. ఎల్.లు ఓ పెద్ద జ్ఞాతులైపోయారు. ఈ దేశంలోవుండే కళాశాలలలోM.A , B. O. L., పోటీ చేస్తూంటే ముందువచ్చిన చెవులకంటె వెనుక వచ్చిన కొమ్ములువాడి అన్నట్లు బి. ఓ. ఎల్.ల పని వాడిగా వుంది. బి. ఓ. ఎల్. ల ఏరియా పెద్దది. ఎం. ఏ. ల ఏరియా చిన్నది. అందుకు మాకీ గతి పట్టింది.

మం:- మీకు అయిదుపంద లిస్తున్నాం పుచ్చుకోండి.

కం. ఎం. ఏ:- ఏం బాబూ! నేను నిజమే చెప్పానే!

మం:- నిజం చెప్తేమాత్రం - సరుకుండవద్దా?

కం. ఎం. ఏ:- మీరిందాక సన్మానించినవారికి సరుకుండి ఏడిసిందాండి?

మం:- వాళ్ళళ్ళో పవిత్రత ఉంది. నీలో లేదు.

కం. ఎం. ఏ:- (బెదురుగుండెతో యింకాతగ్గిస్తాడేమో నని పుచ్చుకొని, వచ్చినత్రోవనే పోయినాడు.)

మం:- తరువాయివారు.

కింకరరావు బి. ఏ:- అయ్యా! మా గురువుగారు ఏ, బి, సి, డీలు రానివారు. ఆయన ఓ వ్యాఖ్యానం వ్రాసారు. దానిమూలం నాకు గుర్తులేదు. నన్ను కాపీచేసి పెట్టమన్నారు. కాపీ చేస్తానని వేసంగి శెలవులకు యింటికిపోతూ పట్టుకుపోయి ఆ సమ్మరులోనే దాన్ని నాపేర అచ్చువేయించుకొన్నాను. తిరిగి మా గురువుగారిని కలుసుకోనే లేదు. కాని నాధైర్యం మా గురువుగారు ఛాందసులు అని ఏమీచేయులేరని అనుకొనేవాణ్ణి. కొంత కాలానికి నామీద ఛార్జీపెట్టారు. మా గురువుగారు నెగ్గారు - నేను ఓడేను. అయినా నా పుస్తకంమీద నాపేరు వుంచుకోవచ్చన్నారు. నేనూ వ్యాఖ్యాన రూపక విమర్శకుడనని నాలో నేనే అనుకోడంకాక మా స్నేహితులుకూడా నన్ను విమర్శశేఖరా! అని పిలిచేవారండి. ఇది నా పేరు, ప్రతిష్ఠాను.

మం:- వెయ్యినూన్నూటపదార్లు పుచ్చుకొని సంతోషించు.

కిం. బి. ఏ:_శాలువకూడా యిప్పించండి.

మం:—నీవుపడ్డ పాట్లకి చాల్లే.

కిం. బి. ఏ:_కిక్కురుమనకుండా ఆ సన్మానం పొంది చక్కగా జారిపోయాడు.

మం:_మిగిలిన తరువాయివారు.

మి. త:_అయ్యా! మంత్రిగారూ! మా జిల్లాలోంచి పదిమంది వచ్చాం. మేమంతా తమాషాపండితులం. ఇందులో మా పాండిత్యం వింతైంది. మాజిల్లాలో ఉన్న గ్రామాల్లో నాల్గు గ్రామాలకి ఓ బ్రాహ్మణుడుంటాడు. అయన మంచి శాస్త్ర పండితుడు గానే ఉంటాడు. ఆ పల్లెల్లో పిల్లా పీచూలేక నిస్సంతుతో వితంతువులతో ఆయా బ్రాహ్మణుల కొంపలుంటాయి. ఆ కొంపలలోకి మేం పోయి ఆ చచ్చిపోయిన పండితులు వ్రాసిన పుస్తకాల్ని వెతికి, పట్టుకొని, పాతికా, నలభై, యాభై, ఆ వితంతువులకిచ్చి, తెచ్చుకొని, మాపేర అచ్చు వేయించుకొని, ఏ విద్వాన్‌కో, ఏ యింటర్‌లకో టెక్ట్సు బుక్కులుగా పెట్టించుకొని గౌరవంగా కుటుంబాల్ని రక్షించుకొంటున్నాం.

మం:_మంచిదే బాగుంది — మళ్లీ ఆ దారినేపొండి. తలో రెండేసి పుస్తకాలు కొనుక్కోండి. నూరేసి యిస్తున్నాం ఒక్కొక్కర్కి సంతోషించండి.

జి. పండితులు:_చిత్తం చిత్తం (అని సన్మానాలందుకొనిపోయిరి)

మం:_మిగిలినవారు ముందుకు రండి.

మిగిలినవారిలో యువకులు:_ అయ్యా! మేము ఓరియంటల్ విమర్శకులము. మా గురువులు మాకు క్లాసులో చెప్పిన విషయాల్ని, చదువుకొనే రోజుల్లో, ఓ నోట్సుగా వ్రాసుకొన్నాం. ఆ నోట్సులో కొన్ని స్థలాల్లో మాకు అన్వయం కాలేదు. అయినా యేదో సరిదిద్ది వార పక్షమాస పత్రికలో చాలా వ్యాసాలు అచ్చువేయించుకొన్నాం. ఆ పత్రికల యధిపతుల కాళ్లూగడ్డాలు పట్టుకొని. ఆ పత్రికాధిపతులిచ్చే బహుమానాల్ని ఆ పత్రికల సంపాదక వర్గంలో నక్కజిత్తుల తాంబూలాచార్యులకిచ్చి యే అడ్డం రాకుండా అంతో యింతో పేరు మేము గడిస్తున్నాము. అంతలో మా పరిసర గ్రామాల్లో ఉండే నిరక్షరకుక్షిగావున్న ధనికవర్గాన్ని వశం చేసికొని ఆ దొంగవ్యాపారాన్ని ఓ పుస్తకంగా అచ్చు వేయించుకొని పెద్దపెద్ద విశ్వ విద్యాలయాల్లో టెక్ట్సు బుక్కుగా పెట్టించుకొంటూ వున్నాం.

మం:_మీ గురువులు వూరుకొనేవారా ఆ పని చేస్తుంటే!

యువకులు:_ వూరుకొనేవారు కారు. ఏదో రంధి తెచ్చేవారు, అల్లరి పెడుతూనే ఉండేవారు. ఈ లోగా కొంతమంది గురువులు చచ్చిపోయారు. బ్రతికివున్న గురువులతో రామ రావణయుద్ధం జరుగుతూనే వుంటుంది. కాని మా గురువులు చాలా పెద్దహోదాలో ఉండేవారే. అయితే అంతపెద్ద హోదా పండితులతో మాకు విరోధం వస్తూంటే మమ్మల్ని ఓ గొప్ప పండితులుగా మా స్నేహితులు, మా పోషకులు భావిస్తూనేఉన్నారు. మేమూ మా దొంగతనాన్ని మర్చిపోయి గొప్పవాళ్ళం అయినాంకాబోలు అనుకొంటూవుంటాం.

మం:_ ఇంత నిజంచెప్పే మీకు వెయ్యినూన్నూట పదార్లు యిస్తున్నాం. తీసికొని సంతోషించి ఇక మీరు మీ చవట గురువులవలె మీ శిష్యులకు నోట్సులు చెప్పడం మానెయ్యండి. ఇక పైన మీబోటి చవటలను మా సభలకు రానీయకుండా చేయండి. ఇందుకే మీకింత సన్మానం చేయుస్తున్నాం.

[యువకులు తలవంచుకొని అభిమానాన్ని వదలుకొని ఆ సన్మానం అందుకొని వుటాయించేరు.]

మం:_ తరువాయి వారు.

దంబాచారి:_అయ్యా! నాకు పరీక్షలకు కట్టేశక్తి లేదు. మెమరీలేదు. సంసార జంజాటంవల్ల బంద చదువు చదువుదామనుకొన్నా, అవకాశంలేదు. ఉదరపోషణ గడవడం కష్టమైపోయింది. ఓ రోజు ఆలోచించాను గట్టిగా. ఓ త్రోవతోచింది. అదేమంటే_ పది ప్రబంధాలు ముందు వేసుకొన్నాను. ఆ గ్రంథాల పీఠికలన్నీ కాపీచేసాను. ఆ కాపీ చేస్తూ ఫలానా ఆయన యిల్లా అన్నారు; ఇది; కొంతవఱకూ బాగానేవుంది; కొంత బాగాలేదు; అనిన్నీ, కొన్ని చాలా బాగున్నాయి అనిన్నీ, కొన్ని కొన్ని మాటలు నావి వైరీతిగా లిఖించి తయారుచేశాను. ఆ బాపతు బండి పుస్తకాలు తయారుచేశాను. ప్రతి సభలోనూ ఆ పీఠికాజ్ఞాన పండితుల చరిత్రలను పొగడ్తలతోనే విస్తరించేవాణ్ణి. దాన్నిబట్టి ఆ పీఠికాజ్ఞాన పండితుల కీర్తికి నేను పెద్ద కీర్తి ప్రదాతనైపోయానని అందఱు పండితులూ నా దగ్గఱకి వచ్చి నా కుత్తరాలు వ్రాసి నన్ను ప్రాధేయపడుతూ తమర్నిగుఱించి కూడా ఏ గొప్పపత్రికలోనో పొగడవలసిందని అప్లికేషన్లు పెట్టుకుంటూ వుంటారు. దాంతో నాకు గర్వం అధికమైపోయింది. నేనూ ఓ విమర్శకుడనే అనుకుంటున్నా.

మం:_బలే విమర్శకుడివి! మనకూ ఇదేకావాలి. మన దేశంలో ఇతరులని పొగడడం అంటే ఆత్మహత్యగా భావించుకొంటారు. నీకు చాలినవాడవు నీవే! అందుకు రెండు వెయ్యి నూటపదార్లు నీకిస్తున్నాం పుచ్చుకో. వార్షికంగా నీకీ పద్దు! స్థిరంచేస్తాం.

దంబాచారి:_(ఆ మంత్రిని, ఆస్థానకవిని, ఆ రాజుని పది పత్రికలలో పొగడడానికి వకాల్తా తీసికొని యింటికి దారి పట్టేడు)

(సశేషము)

## సంక్రాంతి భిక్షు



# సంక్రాంతి సంబరము

శ్రీ కల్లూరి అహోబలరావు

వాకిలివెన్క దాచుకొని వాలెడి కన్నులఁ ద్రోవఁగాంచు, నా
కోకిలవాణి యేలనొకొ? కోర్కెల తీపులవేమొ? నెచ్చెలుల్
షోకుగ సంకరాంతియని - సొంపుగ ముగ్గులఁ దీర్చుచుండ, ము
ల్లోకపు త్రోవలన్ గనుచు. లోలవిలోచన నిల్చియుండెడిన్.

చింతలు గానిపించు జలజేక్షణలోచన యుగ్మమందు, వి
శ్రాంతి నెఱుంగరాదు; అవురా! మనమందలి భావరేఖ లొ
క్కింతగఁ దెల్సిపోయినవి - కృష్ణుఁడు, ముద్దు మనోహరుండు సం
క్రాంతికి రాడు, నేడనుచుఁ గంజదళాక్షి తలంచు నెమ్మదిన్.

అమ్మా! లెమ్ము! భవన్మనోహరుఁడు దా - నత్యంత శీఘ్రంబుగాన్
కొమ్మన్గాంచగ వచ్చుఁ బ్రేమమొలుకన్ - కోనేటికిన్ బోయి, స్నా
నమ్మున్ సల్పుము; క్రొత్తకోకను మెయిన్ - నాణ్యమ్ముగాఁ దాల్చి, పు
ష్పమ్ముల్ నీలపువేణిఁ జుట్టుము సుమా - చాతుర్యమేపారగన్.

పసుపుఁబూయుము, పారాణి పాదములకుఁ-బెట్టుమమ్మరో! తిలకంబుబెట్టి, కనుల
కింత కాటుకఁ దీర్పు మావంతయేని - సోల వలదమ్మ చింతల, సుందరాంగి!

భోగి సంక్రాంతి పండుగల్ పూనివచ్చె - నెల్లెడల, నవధాన్యముల్ వెల్లివిరిసె;
నేడు కర్షకులెల్లరు వేడుకలర - భాగ్యభోగంబులంది శుభంబుగనిరి.

భోగిమంట లేకడఁ జూడ రేగుచుండె - రేగుపండ్లకు బాలబాలికలుమూగి
చప్పరించుచునున్నారు, చప్పటులను - వైచిరమ్మరో! కృష్ణుఁడు వచ్చెననుచు.

బండిదిగి, బావగారదో! వచ్చినారు - పెండ్లికొడుకు, సింగారముల్ వేసినారు,
మెచ్చు పుట్టముల్ తొడవులుదెచ్చినారు-అచ్చుమెచ్చుగ లెమ్మ! ఓయంబుజాక్షి!
పాద్యములఁ దెమ్మ కడుగుము పాదములను ప్రియము దళుకొత్తగ, నమస్క
రింపు మమ్మ!
పీఠమును వైచి కూర్చుండబెట్టుమమ్మ!-ధవుని ముంగిట బిడియాలు దగునటమ్మ!

ఆకలికి, కృష్ణుఁ డెంత యల్లాడినాఁడో? - కలికిరో! మధురాహారముల నొసంగి
యూల పాలిచ్చి, యలసట నార్పవమ్మ! - సిగ్గు బిడియాల కీనాడు-చెల్లునమ్మ!

సజ్జ పెట్టెల పండుగ-సంబరంబు! - పండుగుమ్మడి కూరల పండుగహహా!
నూలు బెల్లమ్ముఁ దినియెడి నోము నేడు!-కృష్ణుతో, సుఖంబుగ నారగింపుమమ్మ!

నూలు, గుమ్మడి పండ్లదానాలఁ జేసి-బ్రాహ్మణు లొసంగునట్టి, దీవనలఁగొంచు
ముట్టఁజెప్పుచు దక్షిణల్ మురిపెముగను-దంపతులు మీరు-వర్ధిల్లి సొంపుగనుడు.

ధర్మగుణమున భారతధాత్రి-పెద్ద - కాలమాదిగ, భద్రవిఖ్యాతిఁ గొనదె?
దానమొసఁగుము నవధాన్యతతులనెల్ల - వెలఁది! వత్తురు 'సంక్రాంతి భిక్ష' యనుచు.

అదిగో! గంగిరెద్దులవాడు ముదముతోడ - మేళ మొనరించుకొనివచ్చె; మెలత! వాని
కిమ్మ నీగట్టినట్టి చేలమ్మొకొండు - పీడయుఁ బిశాచములు వేగ వెళ్లిపోవు.

వేరుశెనగపప్పు వేసి, బెల్లంబులు - పప్పు, కొబ్బరియును పళ్లఁ గలిపి
సల్పినారు రుచిగ, సంక్రాంతినూలు, నో - రూరుచుండుగాదె? ఉత్పలాక్షి!

అమ్మలక్కలు నూలు పాత్రమ్ములంద - కులుకుచుంద్రు - సీతాకోక చిలుకల్లు
వారి వెన్నంటి నూలును పంచిపెట్టి - జాగుసేయక రావమ్మ! జలజనయన!
అరటిపండ్ల నొసఁగు మాయువు వృద్ధిగాఁ - జెఱకుముక్కలమ్ము చింతతొలఁగ
ముదముతోడ నెల్లముత్తైదువ లొసంగు - దీవనలను గొనుమ! స్త్రీలలామ!

భోగి సార్థకమగురీతి - రాగయుక్త - వై, ప్రియుని జేరి భోగంబు లనుభవించి
కళలు దళుకొత్త సంక్రాంతి కాంతి దిశలఁ - బర్వ, సంతుష్టిఁ జెందుమా - పద్మనయన!



# అవతారమూర్తి గాంధీజీ

శ్రీమతి వడ్డి కృష్ణవేణి

దేశములో ననుకోండి, ప్రపంచములో ననుకోండి అన్యాయము, అక్రమము, దుర్మార్గము ప్రబలి, పాపభూయిష్టమైన వాతావరణమును ఉద్ధరించుటకు భగవంతుడు అనేక రూపములుగా నుద్భవించి, అవతారోద్దేశము పూర్తికాగానే అవతారమును చాలించుట పురాణ ప్రసిద్ధము. అటువంటివే రామావతారము, కృష్ణవతారము యిత్యాదులు.

కలియుగంలో సయితం వేరువేరు జాతులు, దేశముల నుద్ధరించుటకు ఉద్భవించి నిర్జీవమై, పతనావస్థలోనున్న ప్రజానీకాన్ని మేల్కొలిపి అభ్యుదయ మార్గములో నడిపినవారు సయితం భగవదంశము కలవారనే చెప్పాలి. అట్టివాడే పూజ్య బాపూజీ.

గాంధీజీ హత్య ప్రతి భారతీయునకు ఆనాడు గొడ్డలిపెట్టులా గుండింది. ఏనాడూ, ఏ పరిస్థితులలోను కంట తడిపెట్టనివారు సయితం వెక్కి వెక్కి ఏడ్చారు. కుల, మత, వర్గ విచక్షణ కతీతుడై భారత ప్రజానీకపు శ్రేయస్సే పరమలక్ష్యముగా నెంచి, వారిని సమైక్యపరచి, సహకార, సహాయములను సమీకరించి దేశాన్ని, జాతిని స్వాతంత్ర్య సమరంలో నాయకుడుగా నడిపి విజేతయయిన అతిరథ మహారథుల మించిన నాయక శ్రేష్టుడు.

భారతీయులలో ప్రబలియుండిన అనైక్యతను ఆధారంగాను, అవకాశంగాను, తీసికొని మన దేశంలోని సంపదను కొల్లగొట్టుకొని పోవుటకు, వారి ఆధిపత్యమును నెలకొల్పుటకు విదేశీయుల కవకాశం చిక్కిన ఫలితంగా భారతజాతి దాస్యాని కొడిగట్టక తప్పిందికాదు. విదేశీయుల పాలన మరింతగా భారతీయులలో అనైక్యత కారణమైంది; దాని ఫలితంగా విదేశీయుల పరిపాలన స్వేచ్ఛగా, నిరంకుశంగా జరుగుతూ వచ్చింది. ఈ పరిస్థితులలో జాతీయతను స్వాతంత్ర్య కాంక్షను ప్రజలలో ప్రబలునట్లుచేసి, స్వతంత్రజాతిగా భారతజాతిని తీర్చిదిద్దడానికి పూనుకొనిన నాయకులలో గాంధీజీ అగ్రగణ్యుడు. గాంధీజీ సామాన్య ప్రజానీకానికి సంబంధించిన ప్రతి సమస్యను స్వాతంత్ర్యోద్యమముతో సమన్వయపరచి బోధించాడు; తాను బోధించినదానిని తానే అనుసరించి చూపాడు దాని ఫలితంగా గాంధీజీలోను, ఆయన బోధనలలోనుగల విశిష్టతను గుర్తించి జాతీయపురోభివృద్ధికి ఆయన నాయకత్వమును హృదయపూర్వకముగా స్వీకరించారు - ఆయన ననుసరించి త్యాగాలుచేసి స్వతంత్ర భారతాన్ని రూపొందించ కలిగారు.

గాంధీజీ ఒక రాజకీయ నాయకుడుమాత్రము కాదు. ఆయన సంఘసంస్కరణాభిలాష, హైందవ సంస్కృతి భాష, విజ్ఞానములపట్లగల ఆసక్తి, రాజకీయపరిజ్ఞానము, ఔదార్యము, విశాల హృదయములాంటివి భారతదేశానికే పితగా రూపొందించినవి. గాంధీజీ ఆర్థిక ప్రణాళికలు, 'అహింసా విధానము సత్యాన్వేషణ, సాంఘిక పురోభివృద్ధికి చూపిన మార్గాలు మన దేశంలోనే కాకుండా దేశదేశాలలో గణ్యతను వచ్చినవి.

గాంధీజీ మరణించినా గాంధేయమార్గాలు, బోధనలు జాతీయసమస్యా పరిష్కారానికేకాక ప్రపంచములోనే శాంతి సౌభాగ్యాల విస్తరణ కుపకరించ కలవిగానున్నప్పుడు ఆయన బోధనలు అనుసరణీయములు. గాంధీజీ కలకాలము ఆరాధనా యోగ్యుడు కూడాను.'



# భ్రమ - ప్రమ

"సులోచన"

ప్రొద్దు అటుమాని పోతూండగా ఆఫీసు నుంచి వొస్తున్న జగన్నాధానికి కాలేజీ బజారు మలుపులో పరిచయస్థుడు నారాయణస్వామి ఎదురు పడ్డాడు.

"ఎన్నాళ్ళకు తటస్థ పడ్డాం! కులాసాయేనా?" అన్నాడు జగన్నాథం.

'అవును. మీరు ఎక్కడా వుండటం?'

"రామానాయుడి పేటలో - ఆఫీసుకు కాస్త దగ్గరగా వుంది. అదీ కాకుండా నీళ్ళ వసతీ, గాలి వసతీ, ఇరుగూ- పొరుగూ మంచి వాతావరణమే!"

"ఎక్కడా - హెల్తు ఆఫీసరుగారు ఉండేవీధి లోనా?"

"కాదు. రైల్వేస్టేషనుకుపోయే సందుకు కొంచెం పెడగా వుంటుంది. పెద్దడాబా రెండు భాగాలు. ఒక భాగంలో మేమూ, రెండో భాగంలో సర్వేశ్వరరావుగారని ఒక వుద్యోగి వుంటున్నాడు——"

"సర్వేశ్వరరావా! అక్కడికి చేరాడన్నమాట. ఏ సర్వేశ్వరరావు? వై. సర్వేశ్వరరావేనా?"

"ఏమో! వై. యో యస్. యో నాకు సరిగా తెలీదు. కొంచం లావుగా, ఎర్రగా, వుంటాడు."

"ఆఁ! ఆఁ! అతనే!"

"నీకు తెలుసా?"

"తెలియకేం!" అని మౌనం దాల్చాడు నారాయణస్వామి. ఆ మౌనంలోని ఆంతర్యం జగన్నాధానికి అర్థంకాలేదు. ఏదో చెప్పేందుకు సంశయిస్తున్నాడని మటుకు గ్రహించాడు. ఆ సంశయించ తగిన విషయాన్ని సమగ్రంగా తెలుసుకోనేందుకు జగన్నాథం మనస్సు అశాంతిలో పడింది. నారాయణస్వామి ప్రక్కముఖంపెట్టి సీరియస్‌గా ఆలోచిస్తోనే వున్నాడు. జగన్నాథం వుక్కిరి బిక్కిరి అవుతున్నాడు.

"అతన్ని గురించి మీ అభిప్రాయమేమిటీ? మంచివాడు కాడా? చెప్పుస్వామీ! అట్లా సంశయిస్తావేం? ప్రక్కన వుంటున్నాడు——లోతు పాతుల్ని తెలుసుకుని సంచరించడం మంచిది కాదూ!" జగన్నాథం నొక్కి అన్నాడు.

ఇహ తనకు ఎదురుగుండా చెప్పక తప్పదనే పరిస్థితి ఏర్పడినట్టు - చెప్పేందుకు వుపక్రమించాడు నారాయణస్వామి.

"అతను పైకి బాగాకనిపించినా——ప్రవర్తన మంచిదిగాదు. ఇదివరకు అతను రాజాపేటలో వుండేవాడు. ప్రక్కయింటి యిల్లాల్ని బలాత్కారం చేయబోతే అతన్ని చావ చితుక కొట్టారు. ఓరి పోకిల్లా! అక్కడ నుంచి మకాం మార్చాడని విన్నాను. మీ ఇంటి ప్రక్కన వుంటున్నాడన్నమాట. ఏమైనా అటువంటివాళ్లు మనబోటివాళ్ల యిండ్లప్రక్కన వుండటం యేమంత శ్రేయస్కరం కాదు."

జగన్నాధానికి వొళ్ళు జివ్వుమంది. అంత నీతిమాలినవాడా సర్వేశ్వరరావు? పైకి ఎంత వినయంగా అగపడతాడు?... తనభార్య వొట్టి అమాయకురాలు! వాడి భార్యతో దీనికి స్నేహం! తను ఉపేక్ష జేస్తే లాభంలేదు... తెలిసిందిగా వాడిరహస్య జీవితం! తను వెంటనే యిల్లు మార్చివేయాలి. తన భార్య అందం మీద వాడు ఏనాడో కన్నువేసి వుంటాడు. పోకిరి వెధవ! తను జాగ్రత్త పడడం మంచిది. తన భార్య అతిలోక సౌందర్యవతి! మొదటి భార్య చనిపోవడంతో తనకీ వజ్రం దొరికింది. కట్నం తీసుకోకుండానే, అందానికి దాసోహం చేసి——పెళ్లి చేసుకున్నాడు. పువ్వుల్లో పెట్టి పూజిస్తో వొస్తున్నాడు.

అటువంటి పోకిరి వాళ్ళను యిళ్ళ ప్రక్కనచేర్చి తను కాపురం చేయలేడు. తను మెల్లగా ఆ ఇంట్లోంచి వెళ్ళిపోవడమే ఉత్తమం, అనుకుంటూ బాగా చీకటి పడ్డాక జగన్నాథం యింట్లోకి వచ్చాడు. కాని భార్య యింట్లోలేదు. సర్వేశ్వరరావు భార్య సుందరమ్మతో కబుర్లాడుతోంది.

మొగుడనేవాడు పగలల్లా ఆఫీసులో పనిచేసి అలసి సాయంత్రానికి యింటికివస్తే, చిరునవ్వుతో ఆహ్వానించేందుకు భార్య గుమ్మంలో లేకపోతే—ఆ మొగుడనేవాడికి రావాల్సిన కోపంకంటే ఆరోజు జగన్నాధానికి యెక్కువ కోపం వచ్చింది భార్య భ్రమరాంబ మీద. మండిగ ప్రక్కనున్న గ్లాసును ఒక్క తన్ను తన్నాడు. ఆ ఇత్తడి గ్లాసు పెద్ద చప్పుడు చేసింది. ఆ చప్పుడుకు భ్రమరాంబ వచ్చింది.

"ఎక్కడ చచ్చావే! ఎప్పుడూ ఆ ప్రక్కభాగంలో పాతుకు పోతావేం? సిగ్గులేదూ! వాళ్లు మన యింటికి అంత విచ్చల విడిగా రారేం?" అరిచాడు. జగన్నాధం మనస్సులోనున్న అక్కస్సునంతా వెళ్ళగక్కాలని వుంది.

ఆ రోజు భర్త వింతధోరణి ఆ ముద్దుల భార్యకు అర్థంకావడం లేదు. అయితే ఆమె ఒకటి తలంచింది. ఆఫీసులో మేనేజరు చేత తనభర్త చీవాట్లు తిన్నాడేమో! ఆ కోపం తనమీద ప్రదర్శిస్తున్నాడేమో! అట్లా భావించడం చేతనే ఆమె భర్త కోపాన్ని సహించగలిగింది.

ఆ రాత్రి పడక గదిలో భార్యకు చూచాయగా తెలిపాడు ఇల్లు మారవలసి వొస్తుందని. ఆమె "ఎందుకు?" అని నిగ్గదీసింది. కాని జగన్నాధం కారణం చెప్పలేదు. భ్రమరాంబ బుంగమూతి పెట్టుకొని—మూడు అంకెవేసి పడుకుంటే, జగన్నాధం మనస్సు చివుక్కుమని ఆమె పాదాల దగ్గర ఆలోచిస్తూ కూర్చున్నాడు.

మరునాటినుంచీ జగన్నాధం ప్రక్కభాగంలో ఉంటూన్న సర్వేశ్వరరావును పరిశీలనా దృష్టితో చూడ నారంభించాడు. ఉదయం భార్య వాకిట్లో నీళ్ళుచల్లి—ముగ్గు వేస్తూంటే సర్వేశ్వరరావు అరుగు మీద కూర్చుని ముఖం కడుక్కుంటోన్నట్టు నటిస్తూ ఆమెకేసి చూస్తున్నాడు. వొంగి ముగ్గు వేస్తుంటే ఆమె పైట జారిపోయింది. జగన్నాధానికి మహాచెడ్డ చిరాకు వేసుకొచ్చింది భార్యమీద. జారిపోయిన పైట మళ్ళీ వేసుకోదేం? అంత నిర్లక్ష్యమా? అవతల ఆ సర్వేశ్వరరావుగాడు రెప్ప అర్పకుండా పైటలేని వక్షం కేసి చూస్తోంటే...'ఒసే! నిన్నేనే! పైట వేసుకోవే!' అని అరుద్దామనుకున్నాడు. అతనిలో అంత ఆవేశం, కోపం, పొంగుకొచ్చాయి. సర్వేశ్వరరావును యీడ్చి చెంపమీద కొట్టాలనిపించింది. వాడి కళ్ళల్లో దబ్బనాలతో పొడవాలనిపించింది. ఇంట్లోకి పిలిచి భార్యను చీవాట్లు వేద్దామనుకున్నాడు. కాని హృదయంలో బాధ పడడం తప్ప ఏమీ చేయలేక పోయాడు జగన్నాధం.

ఎంత అమితంగా డబ్బు వున్నా దాని రక్షణకోసం మానవుని బాధ తప్పనట్లు, భార్య భూలోక సుందరని భ్రమసి మురిసి పోయినా, జగన్నాధానికి ఆమె సౌందర్యంతాలూకు బాధ తప్పలేదు. భార్య అందమైనది కావడం అతనిలో చాల క్రొత్తగుణాలు ఉద్భవించటానికి హేతువైంది. భార్యమీద అతనిలో నిలడిన అమితమైన ప్రేమా, ఆమె అందం మీద అతనికున్న గొప్ప అభిప్రాయం, గర్వం, తృప్తి-అతనిలో సాటి పురుషులమీద ద్వేషాన్ని, అసూయనీ, కోపాన్ని రగిలించాయి.

సర్వేశ్వరరావు మీద జగన్నాధానికి రోజురోజుకీ ద్వేషం పెచ్చుపెరిగి పోతోంది. అతని వేషాలన్నీ కనిపెట్టుతున్నాడు. తన భార్య కోసం అతను ప్రాకులాడుతున్నాడనే విషయాన్ని రూఢిగా తేల్చుకోలేక పోతున్నాడు జగన్నాధం. ఏమైనా జగన్నాధానికి ఆ యింట్లో వుండ మనస్సు వేయటంలేదు. ఒక రోజు భార్యతో ఖచ్చితంగా చెప్పాడు.

"మనం ఈ ఇల్లు మారాలి!"

"ఎందుకు?"

జగన్నాథం గొంతులో వెలక్కాయ అడ్డుపడి నంత పనైంది. తన మనస్సులో వున్న కారణం చెబితే భార్య తుస్కారంగా నవ్వదూ! తను చులకన కాదూ! తన అవివేకం బయట పడిపోదూ!

"ఎందుకేమిటి? నాకు ఇక్కడ బావుండలేదు. మనం తక్షణం యిల్లు మారాల్సిందే!"

"నాకు యిక్కడే బాగుంది. నీటి వసతివుంది. గాలి ధారాళంగా వస్తుంది. ఇరుగూ – పొరుగూ వాళ్ళు మంచివాళ్లు."

"మనకు అన్ని వసతులు లభించే యిల్లే అద్దెకు తీసుకుందాం. ఇక్కడ నేను వుండలేను."

"ఏం మీకు ఏం లోటు అగుపడింది? బందర్లో యింత చవుక అద్దెకు ఇన్ని వసతులుగల యిల్లు మనకు చచ్చి గీ పెట్టినా దొరకదు." అన్నది భ్రమరాంబ.

ఆమాట నిజమే! కాని తను సర్వేశ్వరరావుకు దగ్గరగా వుండటం శ్రేయస్కరంకాదు. తను యెప్పుడైనా యింట్లో లేనిసమయంలో తన యింట్లో జొరపడితే! అతని ఇంటికి తనభార్య వెళ్ళినప్పుడు యెవ్వరూ లేని సమయం చూచి యేదేనా చేస్తే–ఆపైన ఏమనుకొని యేమిలాభం? తను వెంటనే యిల్లు మారాలి. తను పరువు ప్రతిష్టల్ని నిల్పుకోవాలంటే వెంటనే ఇల్లు మారటమే వుత్తమం!

"ప్రయత్నించాలిగానీ దొరక్కుండా పోదు. రేపు యీ పాటికి యిల్లు కుదుర్చుకు వస్తాను."

"వొద్దు. ఇక్కడే వుందామండీ!" అని పట్టు పట్టింది భ్రమరాంబ.

సర్వేశ్వరరావు భార్య సుందరమ్మతో ఆమెకు స్నేహం బాగా కలిసింది. పైపెచ్చు భర్త ఆ ఇంటిని కాదని యెందుకు అంటున్నాడో కూడా అర్థం కావడంలేదు.

"నే చెప్పినట్టు విను. మన మంచికోసమే చెబుతున్నాను. ఇక్కడ వుండటం మనకు మంచిది కాదు." అని జగన్నాథం యెంత చెప్పినా భ్రమరాంబ వినలేదు.

రెండు రోజులు ఉపవాసాలు చేసాక భ్రమరాంబ భర్త అభిప్రాయంతో యేకీభవించింది. అప్పుడుగానీ జగన్నాథం హృదయానికి పరిపూర్ణమైన తృప్తి చిక్కలేదు.

జగన్నాథం వారంరోజుల్లోనే ఆ యిల్లు ఖాళీ చేశాడు. సుందరమ్మ యెందుకు ఖాళీ చేస్తున్నారని అడుగగా భ్రమరాంబ–"మాబంధువుల యిల్లు ఒకటి ఖాళీగా వుందట. అందుచేత అక్కడికి వెళుతున్నాం" అని అబద్ధమాడింది. ఎందుచేతనంటే - యిల్లుమారే అసలు కారణం ఆమెకు కూడా తెలియదు కనుక.

జగన్నాథం గొడుగుపేటకు వచ్చాడు. కాని అక్కడ అతనికి చాల అసౌకర్యంగా వుంది. భ్రమరాంబ రోజూ భర్త తెలివితక్కువ తనానికి చీవాట్లు వేస్తూనే వుంటుంది. జగన్నాథం సహిస్తూనే వున్నాడు. కాని అతనికి మనస్సుకు విశ్రాంతిచిక్కింది.

ఒకరోజు సాయంత్రం జగన్నాథం, నారాయణ స్వామి పట్టాభి మార్కెట్టులో కలుసుకున్నారు.

"ఇల్లు మారారట. ఎక్కడ వుంటున్నారు?" అన్నాడు నారాయణస్వామి.

"గొడుగుపేటలో. ఏం వసతిగాలేదు. గాలి రాదు. ఇంటిముందు మురుగు. వానకురిస్తే బజార్లో మోకాళ్ల వరకు నీళ్ళు. రామానాయుడి పేటలో హాయిగా వుండేవాళ్ళం. ఆ సర్వేశ్వరరావుకు దడిసి ఇల్లు మారవలసి వచ్చింది."

"ఏం! సర్వేశ్వరరావు చాల వుత్తముడు. ఇది వరలో నేను తలచిన సర్వేశ్వరరావు కాదు. ఇతను యస్. సర్వేశ్వరరావు. ఆ సర్వేశ్వరరావుకు విజయవాడ బదిలీ కావడంతో నాలుగు నెలల క్రితమే వెళ్ళి పోయాడట. మీరు యిది వరకు ఉండిపోయిన ఇంటి ప్రక్క సర్వేశ్వరరావు చాల మంచివాడు. అతని భార్య సుందరమ్మ చాల కలుపుగోలు... మనిషి..." చెప్పుకు పోతున్నాడు నారాయణస్వామి.

"నీ కెట్లా తెలుసు?" అన్నాడు జగన్నాథం అక్కసుకొద్దీ.

"నేను ప్రస్తుతం రామానాయుడి పేటలో మీరు ఖాళీచేసి వెళ్ళిన భాగంలో—అంటే సర్వేశ్వరరావు గారి భాగం ప్రక్క భాగంలోనే వుంటున్నాను." అన్నాడు నారాయణస్వామి నవ్వుతూ.

—o—

## ఆంధ్ర దేశంలో ఏకోపాధ్యాయ పాఠశాలలు

ఒకే ఉపాధ్యాయుడుండే 1000 పాఠశాలలను క్రొత్తగా ప్రారంభించాలని ఆంధ్ర ప్రభుత్వము నిర్ణయించింది. వీటిలో 320 పాఠశాలలు అయిదువందలు మొదలు వెయ్యివరకు జనాభాగల గ్రామాలలోను, మిగిలినవి ఐదువందలకంటే తక్కువ జనాభాయుండి పాఠశాలలు లేని గ్రామాలలోను నెలకొల్పబడగలవు. ఈ పాఠశాలల స్థాపన జిల్లాలవారీ వివరములుకూడ నిర్ణయించబడినవి. విద్యావంతులలో నిరుద్యోగ నివారణకుగాను ఇండియా ప్రభుత్వము ఏకోపాధ్యాయ పాఠశాలల స్థాపించాలనే పథకాన్ననుసరించి ఆంధ్ర ప్రభుత్వము కార్యక్రమాన్ని అమలుపరచుచున్నది. ఈ పాఠశాలలు స్థానిక సంస్థల అజమాయిషీలో ప్రభుత్వ సహాయంతో నిర్వహించబడుతుంటవి.

---



వరదరాజస్వామి ఆలయగోపురం (కంచి)

*Photo by* : M. G. MENON

# నాగులచవితి

శ్రీ కోకా బాలకృష్ణరావు



"మీరెన్నైనా చెప్పండి; నాకీ నోములమీదా, వ్రతాలమీదా, దేవుళ్ళ మీదా, దయ్యాలమీదా నమ్మకంలేదండీ" అన్నాడు ఆ ఏడే బి. ఎ., డిగ్రీ పుచ్చుకోబోయే కృష్ణమూర్తి.

"అట్లాగంటే ఎట్లా నాయనా! ప్రతివారికి ఏదో సాంప్రదాయమనీ, ఆచారమనీ ఉంటుందికదా, అదీ కాక యిదీ ఒక పండగకదా! అన్ని పండగలూ చేసుకున్నట్టే యిదీనూ" అన్నాడు మామగారు.

"దానివల్ల ఉపయోగం ?"

"సుబ్రహ్మణ్యేశ్వరుడికి పూజ చేసుకుంటే ఏడాదల్లా చల్లగా చూస్తాడు నాయనా"

"పాముకి పాలుపోసి పెంచినా విషమే కక్కుతుందికాని, మనల్ని దీవించి ముద్దు పెట్టుకుంటుందిటండీ ?"

"అట్లా కాదు నాయనా, మాకు సుబ్రహ్మణ్యేశ్వరుడు మొదటినుంచి ఇలవేల్పు. ఏ పండగమానినా యిదిమాత్రం మానం. మొదటినుంచీ వున్న అలవాటుచేత అమ్మాయి మేలూ, నీ మేలుకోరి యింతగా అడుగుతున్నానుగాని నీవు పంపనంటే మేంచేసేదేంలేదు."

"నా మేలు మీరు మీ సుబ్రహ్మణ్యేశ్వరుణ్ణి కోరకపోయినా, ఆ నమ్మకాల్లేని నన్ను ఆయనేం చేయలేడు. ఎవరైనా నమ్మినవాళ్ళనే చెరిచేది. నమ్మని నన్నేం చేయగలరు" ?

"అదేమిట్రా ఎంతదూరం చెప్పినా నీ మతమే నీది కాని, ఊ అని నీ జిహ్వతో అనలేవేం" అన్నారు యీ సంభాషణ అంతా వింటున్న కృష్ణమూర్తి తండ్రి శ్రీపతి.

"అదేదోపోనీ నువ్వే అనేయ్ ?"

"పోనీండి బావగారూ! వాడెప్పుడూ అంతే. నే చెబుతున్నా తీసుకువెళ్ళండి అమ్మాయిని"

"పోనీలెండి. అబ్బాయికి అంత యిష్టంలేనప్పుడు నన్నుమాత్రం ఎట్లా తీసుకువెళ్ళమంటారు" ?

"నాకేం యిష్టమూ లేదు - అయిష్టమూ లేదు. మా నాన్న పంపితే నిక్షేపంలా తీసుకువెళ్ళండి" అన్నాడు కృష్ణమూర్తి.

కొత్తకోడలు జానకి తలుపుచాటునే వుండి తన భర్తమాటలు వింటూనే వున్నది.

"ఆయన యిష్టం, అయిష్టం లేదనటం గోడమీద పిల్లివాటంగా వుంది. ఇష్టంవుంటే ఎందుకభ్యంతర పెడతారు. అయిష్టం అని చెప్పటానికి యిష్టంలేక, యిష్టాయిష్టాలు తనకేం లేవని తప్పుకుంటున్నారు." అనుకున్నది జానకి.

జానకి కొంచెంసేపు ఆలోచించింది. తనకు ఒకవైపు వెళ్ళాలని వుంది; మళ్ళీ వద్దనీవుంది. అసలు విషయం తనే తేల్చుకోలేకపోయింది. తన నిశ్చయం అయితే తన భర్తను ఒప్పించటం ఎంత తేలికో తనకి తెలుసు.

వెళ్ళటం అనే విషయం తలచుకునేటప్పటికి జానకిమనస్సు సంతోషంతో పొంగిపోయింది. అమ్మ నాన్న - చెల్లీ - ఆవూరూ - ఆ కాలవ - ఆయిల్లూ, ఆదొడ్డి పూలమొక్కలు - తనకి ప్రియమైన ఆవూ - అసలు పుట్టలో ఆవుపాలు పోయాలికదూ. తనూ, తన చెల్లెలూ ప్రతియేడూ, ఆ ఆవుపాలు పితికి, తెల్లవారంగానే స్నానంచేసి ఆరేసిన మడిచీరలు కట్టుకొని, పదిగంటలకల్లా అమ్మతో కలిసి ఊరికి మైలు దూరంలోవున్న కాలవగట్టుమీద పుట్టలో పాలు పోసేటప్పుడు, అమ్మ చెప్పేది తమలో "మంచి

మొగుళ్ళు రావాలని దణ్ణంపెట్టుకోం"దని. తనకు సిగ్గు వేసేది ఆ మాటంటే.

నిజంగా తను ప్రతియేడూ నాగేంద్రుడికి పెట్టిన దణ్ణాల ఫలితమే నేటి తన వాంఛాసిద్ధని జానకి నమ్మకం.

తన చిన్నతనంలో తమ దొడ్డివెనుక పెద్ద అడవిలా వుండేది. పెద్దపెద్ద చెట్లూ, వాటిక్రింద ముళ్ళ కంచెలకు దట్టంగా పెనవేసుకొన్న తీగెలు, నేలంతా తివాచీ పరిచినట్లుండే దట్టమైన పచ్చికతో అదో విధమైన భయం కలిగించేది. అమ్మ ఎప్పుడూ తన్ను దొడ్లోకి వెళ్ళనిచ్చేదికాదు.

తనకు పదేళ్లువచ్చిన తరువాత అమ్మ తరచుగా చెపుతూవుండేది.

తన చిన్నప్పుడు, అంటే తనకు రెండేళ్ళప్పుడు, ఒకనాడు పాక్కుంటూ తోటలోకి పోయింది. అప్పటికి అమ్మ కడుపుతో వుంది. ఆమెకు కొద్దిగా వొంట్లో బాగుండకపోవడంచేత యింట్లో పడుకొని వుంది. తను పాక్కుంటూ సంపెంగచెట్టు క్రిందికి వెళ్ళింది. క్రిందరాలిన పచ్చటి సంపెంగకాయలు నోట్లో పెట్టుకొంటూ, కాళ్ళూ చేతులూ తపతపా కొట్టుకుంటున్న తన దగ్గిరికి ఏమిటో పాక్కుంటూ వచ్చింది, చుట్టలు చుట్టలుగా లొంకిలొంకిలుగా, బలే అందంగా తిరిగిందది. తనకు నవ్వువచ్చి బోసి నవ్వు నవ్వింది. అది తల ఎత్తి తనవైపుకి చూస్తూ ఆడుతోంది. తను బోసినవ్వులు నవ్వుతోంది దానిదగ్గరగా రెండు బుల్లిచేతులతో చప్పట్లు చరుస్తూ.

ఇంతలో అమ్మ అక్కడికివచ్చి "హా!" అని కేక వేసింది. పాము జరజరా పాక్కుంటూపోయింది. తనూ పాకింది పామును పట్టుకోటానికి. ఇంతలో అమ్మవచ్చి ఎత్తుకుంది.

ఈ విషయం అమ్మ తనకి బుద్ధితెలిసిం తర్వాత అథమం రోజుకి రెండుసార్లన్నా చెపుతుండేది. అమ్మ చెపుతుంటే తను ఊహించుకునేది తను పాముతో ఎట్లా ఆడుకున్నదీ — ఎట్లా చప్పట్లు చరిచిందీ

అప్పుడే అమ్మ దణ్ణం పెట్టుకుందిట "పిల్లగాని, పిల్లాడుగాని పుడితే పేరు పెట్టుకుంటా"మని. అందుచేత తరువాత పుట్టినచెల్లికి నాగమణి అని పేరు పెట్టారు. అసలు అంతకు ముందునించే తమ యింట్లో సుబ్రహ్మణ్యేశ్వరుడి పూజ, అదీ తాతయ్యకాలంలో కూడా వుండేదిట. నాన్నకాలంలో రోజూ పూజ చేయకపోయినా భక్తిమాత్రం నసించలా. అసలు ఆ యింటపుట్టిన ప్రతిపిల్లా, ప్రతి పిల్లవాడూ చిన్నప్పుడు ఒక్కసారైనా పాముతో ఆడుకొని తీరాల్సిందే.

అవన్నీ తలచుకుంటే తనకుకూడా వెళ్ళాలనివుంది. ఎందుకనో అమ్మని చూడాలనిపిస్తోంది కొద్ది రోజుల నించి. అసలు నాన్న రాకముందే తనకి తెలుసు నాగులచవితి వస్తోందని. దానికి తప్పకుండా వెళతావనే ధైర్యం తన అంతర్వాణి తనకి బోధిస్తోంది.

మొన్న దీపావళిపండక్కికూడ పంపమంటే మామగారు "కొత్తకోడలు కదా బావగారూ, మా యిల్లు మొదటి దీపావళి పండుగనాడు కలకల్లాడ నివ్వండి" అన్నారు. నాన్నగారు మరిమాట్లాడక వెళ్ళిపోయారు

తనుపోనీ నాగులచవితికి పంపుతారేమోననుకుంది. కాని యిదంతాచూస్తే మామగారి యింట్లో నాగులచవితి అసలు ఒక పండగకానట్లే లెక్కించబడుతున్నట్లుంది. మరి తమయింట్లో నాగులచవితంటే పిన్నలకీ, పెద్దలికీకూడా అంత భక్తి ఎందుకేర్పడిందో తనకు తెలియదు. సుబ్రహ్మణ్యేశ్వరుడు తమ ఇలవేల్పు అవటంచేతనే నేమో!

ఆలోచన తెగకముందే మామగారు "అమ్మాయ్. జానకి! మీ నాన్నగారికి తాంబూలం యివ్వమ్మా" అన్నారు భోజనాలుముగించి చేతులుతుడుచుకుంటూ.

అందరికీ తాంబూలాలు యిచ్చింది. వియ్యంకులిద్దరూ కుర్చీలలో కూర్చొని పిచ్చాపాటీ చెప్పకుంటున్నారు. కృష్ణమూర్తి త్వరగా కాలేజీకి వెళ్ళాడు.

౨

రాత్రి భోజనాలైం తర్వాత వియ్యంకులిద్దరూ బయట వరండాలో వేసిన మంచాలపై ఆశీనులై కబుర్లు

మొదలుపెట్టారు. కృష్ణమూర్తి గదిలో డ్రాయరు మీద కాళ్ళుజాపి కుర్చీకి ఆనుకొని పడుకొని "ఎకనమిక్స్" పుస్తకం తీశాడు మొదలుపెడదామని.

జానకి కంచాలు కడిగి తనపని ముగించుకొని గదిలోకి వచ్చింది. కృష్ణమూర్తి పుస్తకం చేత్తో పుచ్చుకొనే వున్నాడు కాని దృష్టిఅంతా గదితలుపుమీదా, మనసంతా జానకిమీదా వుంది. తలుపు కదలగానే తల పుస్తకంవైపుకి తిప్పి "సీరియస్"గా చదవటం మొదలుపెట్టాడు. జానకి గదిలో వస్తువులన్నీ కదిలిస్తూ, తమలపాకులు చిలకలు చుట్టటం మొదలుపెట్టింది. కృష్ణమూర్తి తల కుర్చీవెనక్కి వేళ్ళాడేసి నోరుతెరిచాడు. జానకి నవ్వుతూ ఒక్కొక్క చిలకనే నోట్లోకి తోసింది. కాని ఎంతసేపటికీ కృష్ణమూర్తి నోరు మూయటంలేదు. ఉన్న కాసిని ఆకులూ దాదాపు అయిపోయాయి

"ఎన్ని నములుతారేమిటి" అంది చిలక నోట్లో పెడుతూ "చురుక్కు"మంది వేలు "అబ్బ మరీ చిన్నపిల్లవాడైపోతున్నారు" అంది జానకి,

"చిలక కరిచిందేమో పాపం" అన్నాడు కృష్ణమూర్తి.

"మా చిలక కొరకటంకూడా క్రొత్తగా నేర్చుకుంది" అంది జానకి.

"ఊ..." అంటూ కృష్ణమూర్తి ఆమె చెయ్యి పుచ్చుకులాగాడు. ఆమె తప్పించుకొని అవతలికిపోయి మూతి ముడుచుకు నించుంది. కృష్ణమూర్తి పిలిచాడు. ఆమె కదలలేదు.

కృష్ణమూర్తికి అర్థంకాలేదు జానకి సత్యభామ ఎందుకయిందో. బ్రతిమాలటానికి బయలుదేరాడు కృష్ణుడిపోజులో,

"ఏం కోపమా ?"

". . . . . . . . ."

"అరె. ఇంతలోనే ?"

". . . . . . . . ."

"పంపించనన్నానని కదూ ?"

"కాదు !"

"మరి ?"

"చెప్పమరి ?" అని ఆమె భుజాలమీద చేతులువేసి తనవైపుకి తిప్పుకున్నాడు. ఆమె చుబుకం పట్టుకొని ముఖం పైకెత్తి కళ్లలోకి చూశాడు. ఆమె నిమీలితలోచన అయింది.

"చెప్పు ఏమిటో ?"

"ఇందాక మీరట్లా ఎందుకన్నారు ?"

"ఏమన్నాను" ?

"దేముణ్ని దూషించారు !"

"సుబ్రహ్మణ్యేశ్వరుణ్ణేనా ?"

"అవును !"

"అదీ దేవుడేనా ?" అని యింకా ఏమో అనబోయాడు. కాని ఆమె తన అరచేతిని అతనినోటికి ఆనించింది. "మీరేమైనా అనుకోండి. పైకిమాత్రం అనకండి. మీకు వాటిమీద నమ్మకం కలిగించమని నేను దేవుణ్ని ఎప్పుడూ ప్రార్థిస్తూనే వుంటా."

"పిచ్చిదానా. రాళ్లు దేవుళ్లైతే రాసులుమింగవా ?" అన్నారు.

"రాళ్లనుకాదుగా యిప్పుడు నేచెప్పేది ! ప్రత్యక్షంగా కనుపించే నాగేంద్రుణ్ణి."

"నీవు నాగేంద్రుడను, నేను పామంటా !"

"ఎట్లాగైనా పిలవండి, అర్థంమాత్రం అదే !"

"అయితే అవి దేవుళ్లని నేను నమ్మలేను !"

"నమ్మకం కలిగినప్పుడే నమ్ముదురుకాని, కాని దూషించవద్దు ,"

"చిత్తం ! ఇంతకీ నీవిప్పుడు వెళ్ళాలా దేవుడు చవితికి "

"మీ యిష్టం !"

## 3

జానకి వెళ్లింది తండ్రితో. బండీ ఊళ్ళోకి మలుపు తిరిగింది. జానకికి చెప్పలేని ఆనందం ఉబికింది మనస్సులో. ఒక్కసారి పెద్ద ఉచ్ఛ్వాసంతీసి జన్మస్థలం కమ్మనిగాలిని గుండెనిండా దట్టించింది. తను కాపరానికి వెళ్లింతర్వాత మళ్లీ యిదే మొదటిసారి స్వగ్రామం రావటం.

ఇంకా కొంచెం దూరంపోయి నాలుగిళ్లు దాటింది బండి. దూరాన కాలవగట్టు, వరసగా ఆగట్టుమీద చెట్లూ కనుపించాయి. ఒక్కొక్క చెట్టే లెక్కపెట్టింది ఏమీ తోచక. 15, 20, 25 వ చెట్టుదగ్గరికి వచ్చేటప్పటికి దృష్టి ఆగింది. దుబ్బులాటి చెట్టు కొమ్మల మీదనుంచి మానుమీదికీ, మానుమీదనుంచి క్రింద వ్యాపించివున్న పుట్టమీదికీ దృష్టి వ్యాపించింది. హృదయం ఉబికింది. మనస్సులోనే నమస్కారం చేసింది దూరానవున్న పుట్టకు, తన భర్తను చల్లగా కాపాడమని.

బండీ యిల్లు చేరింది. మణివచ్చి అక్క చెయ్యి పుచ్చుకొని అక్కవచ్చినందుకు మురిసిపోయింది.

తల్లి కూతురికి దిష్టితీసి కాళ్ళు కడిగించి లోపలికి తీసుకు వెళ్ళింది.

ఒక్కసారిగా గదీ, సావడీ, వంటయిల్లూ, దొడ్డీ, అన్నీ కలియతిరిగింది జానకి. దొడ్లో యిదివరకు సంపెంగ చెట్టువున్నచోటు కనుపించింది. తనకి పాము కనుపించిం తర్వాత నాన్నగారు దొడ్లోని పెద్దపెద్ద చెట్లన్నీ కొట్టించి శుభ్రంచేయించి మంచి మంచి పూల మొక్కలు వేశారు. ఇప్పుడు దొడ్డి బాగుంది. ఇదివరకు సంపెంగచెట్టు వుండేచోట యిప్పుడు నందివర్ధన చెట్టు వుంది.

అక్కడనుంచి దృష్టి దొడ్డి చుట్టూ తిరిగింది. మూలగా పాతిన గాతానికి కట్టినఆవు తనవైపుకు మెడనిక్కబెట్టి చూచింది. ఒక్కసారిగా ఆవు దగ్గరికి పోయి దాని మెడక్రింద చేయివేసింది - అది ముఖం పైకెత్తింది, గోకమన్నట్టుగా తోక ఆడిస్తూ.

మర్నాడు నాగులచవితి. ఆ రాత్రంతా మర్నాటికి కావలసిన వస్తువులు సమకూర్చుకోటంతో సరిపోయింది.

తెల్లవారుఝాముననే లేచి కాలకృత్యాలు తీర్చుకొని అక్కచెల్లెళ్లు ఆవుదగ్గరికి వెళ్ళారు. చెల్లెలు దూడను విడిచింది. అక్క పాలు పితికింది. ఒక పొదుగు దూడకి వదలగా చెంబు నిండింది. నిండిన చెంబుతో లేచి నించుంది జానకి. మణి మళ్లీ దూడను విడిచింది. దూడ ఒక్క పరుగుతో వెళ్లి తల్లిపొదుగు గుద్దింది.

తెల్లవారింది. స్నానాలు పూర్తయాయి అందరికీ. అక్కచెల్లెళ్లు కాళ్లకి పసుపు పూసుకొని పారాణి పెట్టుకున్నారు. అమ్మకూడా స్నానంచేసి పూజకి కావలసిన వస్తువులు సర్దుతూ వంటచేయటం మొదలు పెట్టింది. అక్కచెల్లెళ్లు వెళ్లారు పూలు కోయటానికి.

మూలనున్న నందివర్ధనచెట్టు విరగబూసింది. పూలన్నీ కలిపితే పెద్దబుట్టడయ్యాయి. ఇంట్లో తెచ్చి పోశారు పళ్లెంలో.

అమ్మతో ఒకగంట కబుర్లు చెబుతూ కూర్చుంది. మణి చెవులు నిక్కబొడుచుకొని వింటోంది. 8 గంటలైంది. నాన్నగారు స్నానంచేసివచ్చి సంధ్యవార్చి 8½ కల్లా పూజ మొదలుపెట్టారు. ఏడాదికొకసారి చేసే పూజ కాబట్టి ఏవేవో చేయటంవల్ల 10 గంటల దాకా పట్టింది. పూజ అయింతర్వాత పాలు, చలిమిడి, పువ్వులు, పుట్టకళ్లు, పసుపు, కుంకుం, కర్పూరం, యింకా కావలసినవీ పూజల పళ్లెంలో పెట్టుకొని బయలుదేరారు పుట్టదగ్గరికి.

(సశేషము)

# ముసుగులో గ్రద్దలాట

ఆంగ్లమూలం :
కుమారి వి. రుక్మిణి



అనువాదం :
శ్రీమతి సి. లక్ష్మీపున్నయ్య

"ఏమండీ! మీకు నేను చేయగల ఉపకారమేదో చెప్పండి - చేస్తాను" అన్నాడు డాక్టరు రఘునాద్ తన ఎదురుగా కూర్చొనియున్న వ్యక్తి నుద్దేశించి.

"మీరు నాకేం చేయనక్కరలేదు; కాని యికనుండి మీరెప్పుడు నాభార్యతో మాట్లాడకూడదని గట్టిగా హెచ్చరించడానికి వచ్చాను" అన్నాడు రాజం.

డాక్టరు ఆ నూతన వ్యక్తిని పైనుంచి క్రింది కొకసారి చూచాడు. అతని పెదిమలపై మొలకెత్తిన చిరునవ్వును రాజం చూచి

"నామాటలు నీకు నవ్వుగా నున్నవా!- జాగ్రత్త - నా భార్యతో యికముందెప్పుడైనా కలసికొని మాట్లాడావంటే ... " అన్నాడు బెదరిస్తున్న ధోరణిలో.

"ఎంతకాలమునుండి నీకు పిచ్చి!" అన్నాడు డాక్టరు.

"నేను పిచ్చివాణ్ణనా మీ రనడం" అన్నాడు కుర్చీలో నిటారుగా కూర్చుంటూ.

"నీవు పిచ్చివాడివికాకపోతే చెప్పు! - నీ విచిత్రమైన భార్య ఎవరో, నీ వెవరో, నాకర్థం కావడంలేదు. నేను ఎవరితోనో మాట్లాడకూడదని మీరంటే నేనెవరితో ననుకునేది."

"నేను ఎవరిని గురించి చెప్పుతున్నానో మీకు తెలియదూ!"

"ముమ్మాటికి తెలియదు. చికిత్సకని, మందుకని నాదగ్గరకు అనేకమంది భార్యలు వస్తుంటారు. వచ్చినవాళ్లు తమ ఆరోగ్యాన్ని గురించి వ్యాధులను గురించి అనేకం చెప్తుంటారు. వారికి మందులివ్వడం, చికిత్సచేయడం దైనందిన కార్యక్రమం అంతేకాని మీరెవరిని గురించి చెప్తున్నారో స్ఫురణకు రావడంలేదు. సరైనా చెప్పితే ... " అన్నాడు రఘునాధ్.

"మీరు చాలదూరం పోతున్నారు - మాభార్యాభర్తల ఆంతరంగిక జీవితంలో మీ జోక్యము సహింపరానిది - ఆమె..."

"ఆమె - ఏమిటి"

"మిమ్ములను ప్రేమిస్తున్నట్లు నాకను మానము"

డాక్టరుకు రాజం ధోరణి విసుకు పుట్టించసాగింది. వైద్యసహాయానికి వచ్చిన అయిదారుమంది గది బయట కూర్చొని

యున్నారు. ఎంతసేపయినా రాజం అక్కడి నుండి కదిలేటట్లు కనుపించలేదు. కోపం పట్టలేక మెడబట్టి గెంటేద్దామని చొక్కా చేతులు వెనుకకు మడువసాగేసరికి రాజం సయితం పోరాటానికి సిద్ధమేనన్నట్లు కుర్చీలోనుండి లేచినిలబడ్డాడు. డాక్టరు మరల ఆలోచించి,

"ఏమండీ! — నా కొరకు రోగులు కనిపెట్టుకొని యున్నారు. మీలాగ నేను నా అమూల్యమైన టైమును వ్యర్థపరచుకోలేను దయయుంచి మీరు వెళ్ళిపోతే మంచిది" అన్నాడు.

రాజం వెటకారంగా నవ్వుతూ "నన్ను మీరంత సులభంగా పంపించలేరు. నేను మీతో చెప్పిన దానికి ఖచ్చితమయిన సమాధానం కావాలి. అది మీరు చెప్పేటంతవరకు కదలను" అన్నాడు.

ఇక యీ పిచ్చివాడు సౌమ్యంగా పోడేమోనని వీధి గుమ్మం దగ్గరనున్న నౌకరును పిలచి "వీరిని మెల్లగా బయటికి తీసికొని వెళ్లు" అని రాజంవైపు చూచి "మిత్రమా! నీ మనసేదో కలవరపాటులో నున్నట్లున్నది. ఏ విషయంలోనైనా సరే వాస్తవము తెలిసికొనేదాక తొందరపడి నీ భార్య శీలాన్ని అనుమానించకు — నేను దీన్ని సోదరభావంతో చెప్తున్నాను" అన్నాడు.

రాజం బుర్రలో డాక్టర్ చివరిమాటలు మెరపులాగ మెరిసినవి. నిజంగా డాక్టరు నిర్దోషియేనేమో! అనుకుంటూ యింటికి వచ్చేసరికి రాత్రి చాల ప్రొద్దుపోయింది.

"ఏమండీ! భోజనానికి లేవరూ" అన్నది రాధ.

ఏమిమాట్లాడకుండా రాజం లేచి వెళ్ళి కాళ్లు, చేతులు కడుక్కొని కంచము ముందు కూర్చున్నాడు. రాధ వడ్డించి ఎదురుగా నిలబడి "ఎక్కడికండీ వెళ్లారు!- యింత ప్రొద్దుపోయింది" అన్నది.

"ఆ విషయం నీ కెందుకు — అధిక ప్రసంగం కాకపోతే" అన్నాడు.

త్రాగడానికని ఎత్తిన మంచినీళ్ళ లోటాను క్రిందపెట్టి గబగబ వడ్డించింది తిని లేచి వెళ్లిపోయి కుర్చీలో కూలబడ్డాడు.

డాక్టరు అనిన మాటలు మనస్సుకు కొంత ఉపశాంతిని కలిగించినా రాధ శీలాన్ని మాత్రం రాజం శంకిస్తూనే యున్నాడు. ఉన్నట్లుండి "రాధా! నీలో నేనేదో మార్పును చూడకలుగుతున్నాను. నీ నడత నాకు తృప్తికరంగాలేదు" అన్నాడు రాజం.

"ఏమిటేమిటీ!" అన్నది రాధ.

"ఏమిటో నీకు తెలియదా! — ఆత్మను పరిశీలించుకో — లేకపోతే ఏర్పడే పరిణా

మూలు చాల విచారకరంగా నుండబోతున్నవి.''

''మీరేమనైనా అనుకోండి - నా ప్రవర్తనలో కాని, జీవితంలో కాని ఎట్టి మార్పు రాలేదు.''

రాజంకు పట్టరాని కోపంవచ్చినా ఏమి మాట్లాడలేదు. ఆ మరునాటినుండి చిన్నదానికి, పెద్దదానికి తప్పు పట్టడం, చీటికి మాటికి తిట్టడం, కసరడం అధికమయింది. దాని ఫలితంగా ఎన్ని యాతనలకు గురియైనా రాధ ఓర్పుతో చాలకాలం సహించింది. కాని ఆమె జీవితం దినగండం నూరేళ్లాయుస్సయ్యేసరికి ఒక రోజున అర్ధరాత్రప్పుడు రాధ అదృశ్యమైపోయింది.

రాజం చుట్టుప్రక్కల వెదకాడు ; వెదకించాడు. జాడ కనుపించకపోయేసరికి డాక్టరు యింటికే చేరియుంటుందని నిశ్చయించుకున్నాడు. పెట్టెలోనుండి రివాల్వరు తీసికొని లోపలి జేబులో పెట్టుకొని బయలుదేరాడు. డిస్పెన్సరీ కిటికీదగ్గర చాటుగా నిలబడి ఎవరో మాట్లాడుకోడం విన్నాడు ఎవరో ఎవరు ? - డాక్టరు - రాధ. జాగ్రత్తగా విన్నాడు - ''సేవిక అక్కడ నుండటం కష్టమనుకుంటే యిక్కడనే మాతోయుండు'' అని డాక్టరు చెప్పుతుండటం బాగా వినబడ్డది.

రాజం ఒళ్లు భగ్గున మండింది. దేహం ప్రతిభాగం డాక్టరుపై ప్రతీకారచర్యను ప్రోత్సహించింది. వెళ్ళి డిస్పెన్సరీలో ''డాక్టర్ !'' అని అరచాడు.

డాక్టరు రఘునాథ్, వెంట రాధ ప్రత్యక్షమయ్యారు.

''బలే పెద్దమనిషివయ్యా! నన్ను పిచ్చివాడిక్రిందకట్టి నాభార్య అంటే ఎవరో తెలియదంటే తెలియదన్నావుకదూ !'' అంటూ కళ్ళెర్రజేస్తూ పళ్లు పటపట కొరికాడు.

డాక్టరు, రాధ ఒకరి మొగం ఒకరు చూచుకున్నారు.

''అప్పను ఒకరి నొకరు కడసారి బాగా చూచుకోండి ! - యింకా కొన్ని నిముషాలలో మీ ప్రాణాలు అనంత విశ్వంలో కలసిపోతవి'' అంటూ రివాల్వర్‌ను బయటికి తీశాడు.

ఆ యుద్రిక్త పరిస్థితిలో రఘునాథ్‌కు, రాధకు మాట్లాడడానికి నోళ్లుకూడరాలేదు.

రివాల్వర్ ప్రేలడం - హత్యాకాండ జరుగడానికి కొన్ని క్షణాలే యున్నదేమో ననిపించింది. వెనుకనుండి భుజంమీద తట్టూ ''అన్నయ్యా !'' అని పిలుపు.

వెనక్కు తిరిగిచూచి ''ఏమిటి శారదా! యిక్కడి కెలా వచ్చావు'' అన్నాడు ఆశ్చర్యంగా.

''ఏమిటి అన్నయ్యా! యీ రగడ అంతా. నిన్ననే వదినె వ్రాసిన జాబు చేరింది. యీ రివాల్వర్ ఏమిటి ? - యీ

గొడవంతా ఏమిటి? ఏంమునిగిపోతుందో ననే బయలుదేరివచ్చాను - ఎవరిని చంపాలని నీ యుద్దేశం! - రఘునాధ్ రాధ పినతల్లికొడుకు. రాధ, రఘునాధ్‌లు నీకు ఏమి అపకారం చేశారో చెప్పు'' అంటూ రాజంచేతిలోని రివాల్వర్ లాగుకొన్నది.

''డాక్టర్ తన కన్నయ్యనిగాని, యీ యూళ్ళో క్రొత్తగా ప్రాక్టీసు పెట్టాడని గాని రాధ ఎప్పుడూ చెప్పలేదే.''

''నీవు ఆమెను చెప్పని స్తేగా!-ఎప్పుడూ యింట్లో రుసరుసలేనాయ'' అన్నది శారద.

''రాధా! యీయన బావగారన్న మాట మనకు'' అన్నాడు డాక్టరు రఘునాధ్.

రాజం తన తొందరపాటుకు, మూర్ఖత్వమునకు సిగ్గుపడుతూ ''బావగారు డాక్టరుగారా ...'' అన్నాడు తలవంచుకొని.

శారద సమయానికివచ్చి విషాదపరిణామాలను తప్పించినందుకు మిగిలినవారందరు కృతజ్ఞతను తెలిపారు. ఆ రోజున వాళ్లంతా అక్కడేయుండి భోంచేసి కులాసాగా కాలం గడిపారు.

# "మీ ఋణం తీర్చుకున్నా"

మూలం:
రవీంద్రులు

స్వేచ్ఛానువాదం:
'విజయ - రాఘవ'

రాయచరణ్ పన్నెండేళ్ళ వయస్సులో తన యజమానింట్లో నౌకరుగా చేరాడు. అతనికులం తన కులం ఒకటే అవటంతో ఆయనగారి చిన్నబాబుని తన చేతుల మీదుగా పెంచవలసి వచ్చింది. తనకు తెలిసిన ముద్దు ముచ్చట్లతో ఆ బాబుకి చక్కగా పోషణచేస్తూ పెంచుతున్నాడు. జగన్నాథుని రథ చక్రాలు పరుగెత్తుతుంటే — కాలం దొర్లిపోతుంటే బాబు నెమ్మదిగా రాయచరణ్ కరకమలాలు దాటి గ్రామపాఠశాలలోకి అడుగుపెట్టాడు. అక్కడ చదువు పూర్తిచేసి - మాధ్యమిక పాఠశాల మెట్లెక్కిదిగి — ఉన్నత పాఠశాలగదులు దాటి — కళాశాల ప్రాంగణంలోకి విహరించి - పెళ్ళిచేసికొని - చివరకు న్యాయ సంబంధమైన వృత్తిలో ప్రవేశించాడు. వివాహితుడైనా, రాయచరణ్ మాత్రం కేవలం అతని పోషితుడుగానే వుంటున్నాడు. కాని యజమానురాలు క్రొత్తగా పెళ్ళయిరావటంతో కనబడే వ్యక్తులిద్దరు. ఒక వ్యక్తి తనకు చిన్నప్పటినుండి పరిచయుడైన "అనూకుల్" బాబు. రెండవ వ్యక్తిమాత్రం నూతనం. అయినప్పటికి తనయొక్క ప్రాబల్యత - పలుకుబడి — తనమాటల చెల్లుబడి యివన్నీకూడా ఆమెచే అంగీకరింప బడుతూండేవి. దీనికంతటికీ కారణం తను చిన్నప్పటి నుంచీ అల్లారుముద్దుగా - చేతులారా పెంచిన 'బాబు' తనను గురించి క్రొత్తగా కాపురానికొచ్చిన శ్రీమతికి పరిచయం చేస్తూండటమే అయి వుంటుందని రాయచరణ్ మనస్సులో నిర్ధారణ చేసుకొన్నాడు.

ఇప్పుడు అనూకుల్ ఒక కుమారుని కల్గివున్నాడు. రాయచరణ్ ఆ కుర్రాడి యెడల సంపూర్ణమైన బాధ్యతను వహించాడు. తానే నీళ్ళుపోస్తాడు. తన స్వహస్తాలతోనే ఉతికిన బట్టలను తొడుగుతాడు. ఎపుడైనా మారాంచేస్తుంటే తనే బుజ్జగించి, ఒళ్ళో కూర్చోబెట్టుకొని సముదాయించేవాడు. అనూకుల్ బాబుని యెలా పెంచి పెద్దవాణ్ణిచేసాడో, ఆలాగే యితన్నికూడా చేయాలని కుతూహలం వుండేది. తన బుజాలమీద యెక్కించుకొని "ఉప్పుప్పుగోనె - ఊరగాయగోనె" అని ఆడిస్తూండేవాడు. పాపాయిల భాషల్లోనే పలకరించి - నవ్వించి - నవ్వుకొని — "ఛీ ఛీ..." అని పళ్లుబయటికి కనబడేలాగు పెట్టి మొహం మీద మొగంవుంచి అంటుంటే బోసి నోటిలోంచి తొంగిచూసే నవ్వుల బాలను చూసి ఆనందపరవశుడయ్యేవాడు. "తనుకూడా నిజంగా ఒక అమాయికుడిలాగ, పాపాయివలె మారిపోయి చేస్తున్నానా!" అనిపించేది అతనికే ఒక్కొక్కప్పుడు.

ప్రాకులాటకు అడ్డుతగిలే గడపలను దాటడానికి ప్రయత్నంచేస్తున్న సమయం వచ్చింది. ఎప్పుడైనా అలా గడపలుదాటి వీధి వసారాలోకి చరచరా వస్తుంటే రాయచరణ్ వెళ్ళి పట్టుకోబోయేవాడు. ఒక్కొక్కసారి అందేవాడుకాడు. అందడమే జరిగితే పెంకితనంతో పెనుగులాడి నవ్వుతూ చేతుల్లోకి హాయిగా వచ్చేసేవాడు. "పిల్లిలాగా చేతుల్లోకి వచ్చి, పారిపోవడం - పెనుగులాడటం - పెంకితనం చూపడం" యివన్నీ మానెయ్యడంలోగల నిగూఢ నేర్పరితనం - నిజమైన న్యాయనిరతి అతనిలో కనబడుతూండేది. అటువంటప్పుడు రాయచరణ్ దిగ్భ్రాంతుడయ్యేవాడు. భక్తిపూర్వకంగా-రహస్యం కాకుండా నెమ్మదిగా యజమానురాలితో "అమ్మా! మీ అబ్బాయి ఎప్పుడో ఒకప్పుడు న్యాయమూర్తి అవుతాడమ్మా" అని చెబుతూండేవాడు - అతని చేష్టల్లోగల నిదర్శనాలబట్టి.

క్రొత్త కొత్త వింత మార్పులు వారల్లో రూపొందసాగాయి. తప్పటడుగులు వేస్తూ - వెనక్కి ముందుకు వూగుతూ - పడుతూ నడుస్తుంటే "మానవ చరిత్రలో

"ఒక యుగం ప్రారంభమైందిగా" అని అనుకునేవాడు రాయచరణ్. తండ్రిని "నాన్నా" అని, తల్లిని "అమ్మా" యని, రాయచరణ్‌ని "చెన్నా" అని అంటుంటే, దానిమ్మగింజల్లాంటి పళ్లు చూడముచ్చటగా, ఆ పెదవులమీదనుంచి వచ్చే చిన్నారి, పొన్నారి మాటల మాధుర్యాన్ని విని పారవశ్యుడయ్యేవాడు. అమాంతంగాపోయి, రెండుచేతుల్లోకి తీసికొని హృదయాని కానించుకొని ఆ బుగ్గా - యీ బుగ్గా కందేలాగు ముద్దాడితేగాని రాయ్‌చరణ్‌కి ఆనందంలోంచి మెల్కువొచ్చేదిగాదు మరి! "అత్త-తాత-అమ్మ - నాన్న" అంటూ వచ్చీరాని మాటలతో అమాయికంగా ఆనందంకలిగించే బాబుగురించి తన పరిచయులతో అమితంగాచెప్పి, తెగానందపడేవాడు. ఎంతచెప్పినా తనకు విసుగనిపించేదికాదు. చెప్పిందే, చెప్పుతూ ఆనందసాగరంలో ఓలలాడేవాడు.

'బాబు'తో కాలక్షేపం చేస్తూండే సమయాల్లో అతని బుద్ధి కుశలతను తెలుసుకోవాలని యిచ్ఛకలుగుతూండేది. ఏవో అడుగుతుండేవాడు. బాబు జవాబులు అర్థంగానిలోతులు కలిగివుండేవి. ఆటల - పాటల్లో తాను ఒక్కొక్కప్పుడు గుర్రంగా మారిపోయి - తన వీపుమీద అతన్ని కూర్చోపెట్టుకొని, రెండుపళ్లవరుసలమధ్య కళ్లెంగా తాడుపెట్టుకొని, చెవుల్ని పట్టుకోమని, తాను దూకుతూ - గెంతుతూ ఆడేవాడు. చిట్టి పొట్టి చేష్టలతో అటూ యిటూ పెనుగులాడుతుండేవాడు. చేతకాకపోతే వీపుమీదే పడేవాడు. చివరకు పెద్దగా అరుస్తూ నవ్వుకునేవారు.

ఇటువంటి సందర్భంలో 'అనూకుల్'కి పద్మావతీ తీరపు ఒక జిల్లాకు బదిలీ అయింది. మార్గమధ్యంలో కలకత్తాగుండా పోతూ పోతూ కొడుక్కి, ఆడుకుంటానికి ఒక చిన్నబండి నడిచేది, చలివేయకుండా చేతుల్లేని పసుపు పచ్చని చిన్నచొక్కాయ (Waist coat), బంగారు జరీతో కుట్టినటోపీ, యింకా ముచ్చటగా పసిడి కంకణాలు, అందెలు కొన్నాడు. ఆచార వ్యవహారంగా వీటన్నిటికి జాగ్రత్త - బాధ్యత వహించవలసింది రాయ్‌చరణ్ ఒక్కడే, ఎప్పుడైనా షికారుకి బయలుదేరతీస్తే.

అప్పటికి వర్షాకాలం వచ్చింది. రోజువిడిచిరోజు కుండలతో గుమ్మరించినట్లు వానలు కురుస్తుంటే వడివడిగా ప్రవాహాలు అంతులేకుండా బయలుదేరినయి. పూరిగుడిసెలు - పైకప్పులులేని మిద్దెలు గ్రామాలు - పంట పొలాలు - పెద్దపెద్ద గడ్డిమేట్లు - అడివి సరుగుళ్లు వీటన్నిటినీ కప్పుకుంటూ ఆకలిగొన్ననది మహా సర్పంలాగా కబలిస్తూ ప్రవహిస్తోంది, ఆ యిసుక తిన్నెలమీదనుండి. ఉండి - ఉండి పెద్దపెద్ద రొదనులతో తీరాన్ని నల్చుకొంటూ-ఎడతెగక ప్రవహించే నదీహోరు దూరంనుండి వినిపిస్తోంది. తెట్లు తెట్లుగా-ముద్దముద్దగా గట్టి దరులను కౌగిలించుకొంటూ ఊగిసలాడే నురుగును చూస్తున్న కళ్ళే రుజువు చేస్తున్నాయి ఆ నదీ ప్రవాహం యెంత వేగంగా పరుగెత్తేదన్నీ...!

ఒకనాటి మధ్యాహ్నానికి వర్షం వెలిసింది. ఆకాశం నీలమేఘాచ్ఛాదితమైవుంది. కాని చల్లదనం - వెలుతురు మాత్రం సమాన పరిమాణంలో వున్నయి. ఇంత చక్కని మధ్యాహ్న వాతావరణంలో నిరంకుశంగా రాయ్‌చరణ్ నిలవదొక్కుకొని వుండలేకపోయాడు. అత్యంతానందంతో ఆడిస్తున్న బాబుని, క్రొత్తగా కొన్న బండిలో ఎక్కించుకొని, నెమ్మదిగా నడుపుతూ పద్మనదీప్రక్క వరిపొలాల చేరువకి చేరాడు. నదిమీద ఒకచిన్న తెప్పకొయ్యగాని, పడవగాని, పొలాల్లో ఒక్క మనిషిగాని కనిపించలేదు. పడమర దిశను చీలుస్తూ మేఘాలు మాత్రం నీటికడ్డంగా అవతలిగట్టున అలముకొని వున్నయి. అలవాటు ప్రకారంగా అస్తమించే సూర్య భగవానుడు మేఘాల్లోంచి త్రుళ్ళిపడుతూ - వెళ్లిపోతున్నాడు. అమందానంద సంధ్యారాగంలో - హఠాత్తుగా - తనముందున్న దానిమీద వేలుచూపుతూ బిగ్గరగా-

"చెన్నా! యీ పూ ..."

చుట్టుప్రక్కలవున్న బల్లపరుపులాంటి బురద ప్రాంతాన్ని కప్పిపరుస్తూ ఒక పెద్ద కదంబవృక్షం పువ్వులతో నిండిపోయి నయనానందకరంగావుంది. ఆ పూలచెట్టువైపు తిరిగి అలాగే, విపరీతమైన ఆకలిగొన్నవాడు గనుక దూరాన గాజు అద్దాల్లోంచి,

బంధించబడిన మిఠాయి సరుకువంక చూసేచూపులాగా చూస్తున్నయి అతనికళ్లు. ఆ చూపుల్లోగల అర్థాన్ని రాయ్‌చరణ్ గ్రహించలేకపోలేదు. అయినా కొద్ది క్షణాలు ముందుగానే, అతడు పూలన్నీ పోగుచేసి బంతులుగా చిన్నబండికి కట్టాడు. వాటన్నిటిని దారంనుండి లాగిపారవేయాలని బాబు చాలా కుతూహలపడుతున్నాడు. కాని అలా, లాగిపారవేయడానికి యేవిధంగాను వీలుగాకుండా వుంది. రాయచరణ్‌కి గుర్రంనుండి - గుర్రపు నౌకరుగావుండే వున్నతస్థానం యివ్వబడింది.

కాని, ఆ సాయంత్రంపూట మోకాలివరకు బురదలోదిగి పూలుకోద్దామని అభిలాష లేనేలేదు రాయచరణ్‌కి. యీ దృష్టినుంచి అభిప్రాయం మార్చాలని వెంటనే తన వ్రేలు మరొకవైపుకి చూపుతూ బిగ్గరగా "ఇటుచూడు బాబూ! యీ పిట్ట, అరెరె! ఎంత చక్కగా ఎలా ఎగురుతుందో" అంటూ విచిత్రమైన గొంతుకతో ఆ చెట్టుదగ్గరనుంచి బండిని వేగంగా త్రోసుకుపోయాడు రాయచరణ్.

కాని పిల్లవాడు మాత్రం న్యాయమూర్తి అయ్యే విధంగా వున్నాడు. అతని దృష్టిని మార్చడం చాలా కష్టంగా వున్నట్లుంది. ఇరు ప్రక్కల కనబడే ప్రకృతి అతని కళ్ళను ఆకర్షించినట్లులేదు. అమాయికంగా ఎగిరేపక్షియొక్క నటనాకౌశలాన్ని ఎంచి, యీ విధంగా వుంటుందని యెప్పటికీ అనుకోలేము - ఊహించలేం. బాబు బుర్రలో ఆలోచనలు యెక్కువయినయి. ఆ పూలు తెచ్చి యెలాగైనా వాటితో ఆడుకోవాలనే గట్టి పట్టుదలలో వున్నట్లు కనబడుతుంది అతని ముఖం. రాయ్‌చరణ్ వింతలు - వినోదాలు చివరిదశలోకి వచ్చాయి. అతను యేంచేసినా - యేంమాట్లాడినా - ఆ బాబుకి ఎటువంటి వుల్లాసం - వుత్సాహం ఆహ్లాదకరం కలిగేటట్లులేదు. చివరికి ఒక్కసారి నిట్టూర్పు విడిచి,

"బాగుంది ... బాబూ ..." అంటూ నెమ్మదిగా దగ్గరగావచ్చి-

"నీవీ బండిలో కూర్చో. నేపోయి అందంగా వుండే ఆ పూలుకోసి తెస్తా, మరిచిపోయి ఆ నీళ్ళ దగ్గరకు పోయేవుసుమా!" అని మోకాలివరకు పంచె యెగగట్టి చెట్టుదగ్గరగా ప్రవిస్తున్న బురదనీళ్ళలోకి దిగాడు. బాబు తన్ని నిషేధించిన నీళ్ళకు దూరంగానే వున్నాడు. త్రుళ్ళిమీదపడే బురదతో - అతివర్షవడిగా జిలజిలమని ధ్వనించే పద్మానది ప్రవహిస్తోంది. వేయిమంది పిల్లల నవ్వుల ధ్వనితో రాయచరణ్ యెడల వినయ విధేయతలులేకుండా పరుగెత్తున్నాయి తరంగాలు. ఇటువంటి దృశ్యసమీక్షలో ఆ పసివాని హృదయం ఆనందం ఆపుకోలేక బండిలో కూర్చున్నవాడల్లా ఎవరికీ తెలియకుండా - ఎటువంటి శబ్దంచేయకుండాదిగి గున - గున వూగుచూ - నడుస్తూ నీటి దగ్గరకు చేరుకున్నాడు. దారిలో దొరికిన చిన్న పుడకతో చేపలపట్టేవాడిలాగా ఆ నదీ తీరాన నటించడం మొదలు పెట్టాడు. రహస్యమైన గొంతుధ్వనులతో ఆ జలసుందరి సమూహం తమతో ఆడుకుంటానికి రమ్మని పిలుస్తున్నట్టుగా తోచింది ఆ పసిబాబుకు. ఎందువల్లనో మరి.

మోకాలివరకుదిగి-బట్టలన్నీ బురదచేసుకొని యెలాగైతేం ఆ చెట్టునుండి అందంగల పువ్వుల్నితీసి, తన పంచె చివరికిగట్టి — వుత్సాహంతో మొగం చేటంత చేసుకొని నవ్వుకుంటూ తెచ్చాడు. తను మాత్రం అనుకున్నాడా బండీదిగి యెక్కడికైనా పోతాడని. నాలుగు ప్రక్కలూ కలయచూసాడు. కళ్లు పెద్దవిచేసి మరీచూసాడు. బండి వెనకా — ముందూకూడా చూసాడు. క్రమేపీ — అంతకంతకు హృదయంలో నిరాశ, కళ్ళలో నీరు ప్రబలటం యెక్కువయింది. నదీహోరు శబ్దంకన్న — తన బుర్రలోని ఆలోచనల తీవ్రత యెక్కువయింది. శరీరంలో ప్రవహిస్తూ — ప్రవహిస్తున్న వేడిరక్తం కాస్త, అనుకోకుండా హిమవత్పర్వతంమీది మంచులాగా గడ్డకట్టుకుపోయింది నల్లనిపొగభయంవల్ల. యీ సర్వ జగత్తంతా మంచుతో చుట్టబడినట్లుగావుంది తన కళ్లుముందు లోతుగాపగిలిన తన హృదయాల్లోంచి, "బాబూ— బాబూ!" అని తీక్షణమైన ఒక పిలుపు బయటి

కొచ్చింది. కాని ఆ పిలుపుకి సమాధానం "చెన్నా" అని యెక్కడనుండీరాలేదు — ఏపసిపిల్లవాడు నవ్వ లేదు. ఏప్రాపులాడే పసిపాపకూడా తనను ఆ విధంగా — ఆనందంగా ఆహ్వానించలేదు. తనముందు అరుస్తూ — కిలింతలుకొడుతూ — తనకేమీ తెలియ దన్నట్లు — తెలిసియున్నా ఒకవేళ దగ్గరకొచ్చి ఒక స్వల్ప మానవునితో ఒక పసిపిల్లవాని చావు కబురు వివరాలు హాజరయి చెప్పడానికి తీరికలేనట్లు చక్కా పోతుంది, పద్మావతీనది నిర్భయంగా—నిశ్చింతగా!—

"చీకటి పడొస్తోంది — యింకా పిల్లవాడు రాలే దెందుకా? యెక్కడున్నాడో — యేమిటో?" అని రాయచరణ్ యజమానురాలు ఆదుర్దాపడు తుంది. లాంతర్లిచ్చి వెతకడానికి మనుష్యుల్నికూడా పంపింది నాల్గుప్రక్కలకు. తిరగ్గా, పద్మానదీ తీరాల్లో తుఫాన్‌లో వీచే ప్రభంజనంలాగా రాయ చరణ్ భయంలేకుండా ఆ పంట పొలాలన్నిటిని వెతుకుతూ—"బాబూ! బాబూ! నాచిట్టిబాబు!" అని ఏడుస్తూ ఏడుస్తూ సంచరించటం చూసారు. ఏ మొగం పెట్టుకొని యజమానురాలి దగ్గరకు పోవాలో అతనికి పాలు పోవడంలేదు. ఎలాగై తేనే రాక తప్పిందికాదు. వచ్చీ రావడంతోనే యజమాను రాలి పాదాలమీదకు సాష్టాంగంగా మోకరిల్లాడు. చేరిన వాళ్ళంతా ఎన్నో ప్రశ్నలువేసి వూగించారు. తమ పిల్లడు యెక్కడున్నాడో చెప్పమని, ఎక్కడ వదలిపెట్టావో తెల్పమని, ఎంతగానో వేధించారు. వీటన్నిటికి సమాధానం కన్నీళ్లు కార్చుతూ "తెలి యదు" అని మాత్రం చెప్పకలుగుతున్నాడు. తను చేయవలెనని చేసిన కృత్యమా! ఏదైనా ఫలితము కోసం పాటుపడినదా? ఏదికాదు. అతని ఆనందం కోసం బ్రతుకుతున్న బ్రతుకేగా తనదికూడా! విధి బలీయంలేకపోయినప్పుడు యేంచేయడానికి సాధ్య పడదుగా!

ఇటువంటి స్థితిలో ప్రతివొక్కరూ తమ తమ అభి ప్రాయాలను రకాలు రకాలుగా స్పష్టీకరించడం మొదలెట్టారు. ఒకాయన బుర్రలో సొక్కకొని యున్న అభిప్రాయం:— "వెలుపలికివచ్చి పద్మానది యేమైనా మింగివేసిందా! యీ రోజు మధ్యా హ్నం తరువాత కొంతమంది చెంచుగుంపు వూళ్లోకి వచ్చిందని తెలిసింది. ఒక వేళ వాళ్ళపనేమైనా వుంటుందేమో!" అని కొన్ని గొంతులు తమ అను మానాల్ని రూఢిచేసుకోవడం మొదలెట్టారు. ఆలో చించగా — ఆలోచించగా యజమానురాలు చాలా తెలివితక్కువతనంలోకి వెళ్లిపోయింది. "రాయ చరణ్ తన కొడుకుని దొంగిలించాడని గట్టిగా నమ్మే సింది." యువతలికిపిల్చి,

"రాయచరణ్! నా బాబుని నాకు తెచ్చివ్వవూ! నా బిడ్డను నేను చూసుకోనివ్వవూ! నీకు ఎంత డబ్బు కావాలంటే అంతా యిస్తాను. ఒక్కసారి నా ముద్దు బిడ్డను నా కళ్లకు చూపవూ!" అని గద్గదికంతో — కరుణాత్మకంగా ప్రార్థించింది.

ఒక్కసారి నుదురు బాదుకున్నాడు. ఏంసమా ధానం యివ్వాలో తెలియక రాయచరణ్ మౌనంగా అలాగేవుండి, దీనత్వంతో నిలుచుండిపోయాడు. మన స్సుని చిక్కబట్టలేక ఆమె "ఇంట్లోంచి బయటికి వెళ్ళమని ఆజ్ఞాపించింది." అనుకుల్ మాత్రం అన్యాయమైన యీ అనుమానానికి నిజమైన కారణం కోసం భార్య విచారణను విడిచి ప్రయత్నిస్తున్నాడు.

"ఇక భూమ్మీద ఎందుకు?"

"అతను మనస్ఫూర్తిగా ఆ విధంగా చేస్తాడా?" అనుకుల్ బాధపడుతూ అడిగాడు.

"ఇంకా పిల్లవాడి ఒంటిమీద బంగారు నగ లున్నయి — అవేమైనాయో! ఎవరికి తెలుసు" అని ఘోషపెడుతుంది—అనూకుల్ శ్రీమతి. యీ కారణం ఆమెతో పరిష్కరించబడటం సాధ్యంగాదనిపిస్తుంది తరువాత ఆలోచిస్తుంటే.

## ౨

ఇదివరకటి మాదిరిగా ప్రవర్తించడానికి ముఖం యెలా చెల్లుతుంది—రాయచరణ్‌కి మళ్లా ఆ యింట్లో. పదిమందికలిసి అనేక విధాలుగా మాట్లాడి నోరు మూసి — అప్పటిదాకా అతనిమీద విశ్వాసంవున్న వాళ్లు, వాళ్లతోగూడా తాళంకలిసి — "నీవు చేసింది

నిజంగా తప్పే" అని నోటిమీద చేతులువేసి నిందారోపణ చేస్తుంటే, "అదికాదు—నేనేమీ యెరుగను" అని సత్యం తెలుపుకునే మనస్సుమాట విననివ్వరుగా!

యీ సంఘర్షణలో భగ్నహృదయుడై తన స్వగ్రామానికి తిరిగి వచ్చాడు రాయచరణ్. కాలం దొర్లకుండా వుండదుగా మరి! తరువాత, తరువాత వివాహమయినా సంతానం కలగలేదు. జీవితానందాన్ని నిరూపించుకోనేందుకు కుమారుడుగాని—కుమార్తెగాని కలగరనే సందేహం అతనిలో పాతుకుపోయింది. కాని ఎలాగైతేనేం ఆ సంవత్సరం అంతమయ్యే ముందు మాత్రం తన భార్య ప్రసవించడం — తనకు ఆనందం కలిగింపచేయడం జరిగింది. అంతులేని ఆనంద పారవశ్యము రుచిచూడాలనిపించి, వేచివున్నాడు. దేనికైనా అదృష్టమనేది — ఒకరికి పెట్టి పుట్టటమనేది వుండాలిగా లేకపోతే మనకా వస్తువు దక్కుతుందా! యీ విషయంలో కర్మకూడా ఒకచేయి సాచేవుంచుతుంది. విధివ్రాత వీటన్నిటికంటే అనుకూలంగా వుంది. కాబట్టి రాయచరణ్ అదృష్టాన్ని అనుభవించడానికి నోచుకున్నా అతని భార్య అతనిపట్ల ఋణం తీర్చుకొని వెళ్ళిపోయింది.

తనకు కుమారుడు పుట్టాడని తెలిసీ తెలియడంతోనే, పోయిచూచాడు. హృదయం రోషంతో ముంచుకుపోయింది. చిన్నబాబు ఆక్రమించుకున్న హృదయ స్థానంలో యీ పిల్లవాడొచ్చివుండటం అనేది సంశయంగా వుండలేకపోయింది. ఆలోచనలు ఎక్కువైనకొలది, మొలకెత్తే భావాలు రకరకాలుగా వుండటం సహజం. "ఏదో ఒక సమాధి కన్న కుమారునకు సౌఖ్యప్రదం చేయడానికి యీ నేరం చేసి వుంటుందని, కాని తన చిన్నబాబు విషయంలో ఏం జరిగిందీ తెలియలేని పరిస్థితిలో పడిపోయాడు. విధవరాలైన తన చెల్లెలే గనుక లేకపోయినట్లైతే ఆ పిల్లవాణ్ణి ఎవరు పెంచేవారు. ఒకవేళ ఎక్కువకాలం బ్రతికివుండలేకపోయేవాడు.

కాని, క్రమేపీ రాయచరణ్‌లో మార్పులు రాసాగాయి. విచిత్రంగా జరుగుతున్న దృశ్యాల్ని చూస్తున్నాడు. పుట్టిన పసిపిల్లాడు నెమ్మది నెమ్మదిగా దోగాడుతూండటం - అమాయికంగా నవ్వుతూ - తంటాలమారిలాగా — పడుతూ - లేస్తూ — గుమ్మాలు దాటుతూండటం జరుగుతోంది. తనకు అడ్డుతున్న అడ్డంకులన్నీ తప్పించుకొని వింతలు — వినోదాలు కలిగించేవాటికి తహతహలాడిపోవడం — అర్థంగాని భాషను ప్రసారంచేసే ఆ గొంతుక — దానిధ్వని — ప్రసారంలో వినబడేనవ్వులు—కన్నీరు కార్చేట్లు వెక్కి వెక్కి యేడ్పులు — ఆ బంగారు మురుగుల చేతుల అభినయం — ఏవేవో కావాలని కాళ్లు - చేతుల సంజ్ఞలు అవన్నీ ఆ, నా, చిన్నబాబువే. రోజులు తరుగుతున్నకొద్దీ, కొడుకు ఏడుపువిన్నప్పుడల్లా రాయచరణ్‌కి హృదయం హఠాత్తుగా అదోవిధంగా, ప్రక్క యెముకలనుదాటి వ్యాకోచించినట్లుగా అనిపిస్తుంటుంది. ఒక్కొక్కసారి అదేపనిగా వింటూ— ఆలోచిస్తుంటే, — చూడగా — చూడగా తను చిన్నబాబు ఆ మృత్యు లోకంలో ఎవరికి తెలియని అనిర్దేసిత ప్రాంతంల్లోంచి ఏడుస్తూన్నట్లు వినిపిస్తుంది. ఎందుచేత? 'చెన్నా'ని పోగొట్టుకున్నాననిగదూ!

రాయచరణ్ కుమారుడు 'పైల్నా' మెల్లగా 'అమ్మ — నాన్న — అక్క' అంటూ పలకడం నేర్చుకున్నాడు. కొన్ని మాటలు ఒత్తించి అనిపిస్తున్నాడు. రాయచరణ్ ఆ చనువుగల మాటల్ని విన్నప్పుడల్లా తన రహస్యం హఠాత్తుగా — ఒక్కసారి తేటతెల్లమై పోతూండేది. చిన్నబాబు 'చెన్నా' అనే పదాల వర్ణక్రమం యెప్పటికీ మరిచిపోడు. కాబట్టే అతను స్వగృహంలో జన్మించగలిగాడు.

వాదానికి అనుకూలంగా, రాయచరణ్ మొత్తం మూడు కారణాల్ని సమకూర్చాడు. ఎందుకు వాదన? దేనికోసం?

ఒకటి:—"తన చిన్నబాబు మరణించిన మరుక్షణంలోనే క్రొత్తగా కుమారుడు జన్మించడం,"

రెండు:—"మంచి గుణాలన్నీ మూటగట్టి కడుపులోవున్న పసికందుకు తన భార్య మధ్యలో యివ్వనూలేదు,"

మూడు:—"యీ క్రొత్త పాపడు ప్రాకుతూ — తప్పటడుగులు వేస్తూ—పడుతూ — లేస్తూ—"నాన్నా" అని "అమ్మా" అని పిలుస్తూండేవాడు. కాని భవిష్యత్తులో న్యాయాధికారి కాగలడని అనుకోవడానికి కావలసిన గుర్తులు లేకపోవడం."

ఆనాడు తన యజమానురాలు, చిన్నబాబు తల్లి తనపైన మోపిన భయంకరమైన నిందారోపణలు — అన్నటువంటి మాటలు దొంతర, దొంతరులుగా జ్ఞప్తికి రాసాగాయి. రాయచరణ్‌కి "ఆ...నిజమే! ఆ తల్లి హృదయం సరళమైందే. నే నామె బిడ్డను తస్కరించినానని తెలుసు నామెకు." అని తనకు తాను ఆశ్చర్యంతో నచ్చచెప్పుకున్నాడు. ఒక్కసారి యెప్పుడైతే యీ నిష్కర్షత్వానికి వచ్చేసాడో, గతంలో చేసిన వుపేక్షకోసంగాను పశ్చాత్తాపంతో నిండిపోయాడు. ఇప్పుడు రాయచరణ్ హృదయపూర్వకంగాను, తనేవిధంగాను కష్టిస్తున్నానని అనుకోకుండా ఆ కుర్రాన్ని అల్లారుముద్దుగా, అన్నివేళలందు నీడగా వుంటూ భావిత్వానికి ఉపయోగించే వ్యక్తిగా తయారుచేస్తున్నాడు. పెంచి పెద్దవాడ్ని చేసి తనకార్యసాఫల్యాన కొనసాగించాలనుకున్నాడు. ఆనాడు తన చిన్నబాబుకి కలకత్తాలో కొన్న సామానులాంటివే, నడిచేబండి, పసుపు పచ్చగా వున్న చేతులులేని చొక్కాయి, బంగారు జరీతో అల్లిన టోపీ, తెచ్చాడు. చనిపోయిన భార్యకున్న నగలన్నీ కరిగించి ముంజేతి కంకణాలు, కాళ్లకు అందెలు చేయించాడు. ఇరుగు — పొరుగు కుర్రకుంకల స్నేహంతో, అల్లరి — చిల్లరిగా తిరుగనివ్వకుండా చేసాడు. రాత్రింబవళ్లు అతనే, అన్ని కార్యరంగాల్లో స్నేహితుడిలాగా — బంధువులాగా - తండ్రిలాగా — తల్లిలాగా ప్రవర్తించడం మొదలుపెట్టాడు. వయస్సు తోసుకొస్తున్నకొద్దీ నీచంగాను - చెడ్డగా నడుచుకోకుండాను శృంగారచేష్టల్లో మెసలకుండాను తన మంచితనాన్ని చూపుతూ మసలుకోవడంతో ఆ వూరివాళ్ళంతా "మా ప్రభుత్వానికి నీవే రాజు"వన్నట్లు పొగడేవారు. కొందరు అతన్ని వేళాకోళంగా ఆడిస్తుండేవారు. "రాయచరణ్ ఎంత జాగ్రత్తగా పెంచుతున్నాడు!" అని విస్తుపోతుండేవారు, వయస్సు మళ్ళినవారంతా. పాఠశాలలోకి పోయి చదువుకునే రోజులొచ్చాయి, వున్న కుంటపొలం కాస్తా అమ్మి రాయచరణ్, ఆ కుర్రాడిని వెంటబెట్టుకొని కలకత్తా నగరం చేరాడు. అతి కష్టమీదలాగో నెలకు నల్భై రూప్యములు సంపాదించగల నౌకరు వృత్తి సంపాదించాడు. 'ఫైల్నా'ను జాగ్రత్తగా పాఠశాలకు పంపుతూ, తాను జీవితం గడుపుతున్నాడు. చదువు విషయంలోగాని — తిండి విషయంలోగాని — యితర విషయాల్లోగాని 'ఫైల్నా' హృదయానికి బాధ కలిగించకుండా చేస్తున్నాడు. రహస్యంగా ఒకనాడు "చిన్నబాబూ! నీవు నన్నెంతగానో ప్రేమించావ్, అందుకే మళ్ళా తిరిగి మా యింటికొచ్చావ్ — ఎప్పటికీ నేనుచేసే యే అశ్రద్ధపూర్వకమైన పనులవల్ల నీవు బాధపడిపోవు సుమా!" అని అంటూండేవాడు.

ఈ రీతిగా పన్నెండు వసంత ఋతువులొచ్చి వెళ్ళిపోయాయి. 'ఫైల్నా' చదవడం—వ్రాయడం బాగా అలవర్చుకున్నాడు. ఆరోగ్యవంతంగాను - చూపుల కందంగాను వుండటం నేర్చుకున్నాడు. వ్యక్తిత్వరూపాన్ని ప్రదర్శించాలని తగినంతగా ప్రయత్నిస్తున్నాడు. ప్రత్యేకంగా కేశసంస్కారం విషయంలో మరీ యెక్కువ. దూబరాగా డబ్బు తగలేసి తనకుగాను, యిష్టంవున్నా లేకపోయినా, అందంగా కనబడిన వస్తువులన్నీ కొనుక్కొచ్చేవాడు. రాయచరణ్‌ని తండ్రిగా భావించి చూసిందెప్పుడూ లేదు. ఎందుచేత? ఒకవేళ తండ్రిగా, అతనిచే చూపబడుతున్న ప్రేమలోగాని, వాత్సల్యంలోగాని వున్నప్పటికీ, నౌకరీలాగవుండి సంచరించడం, జరుగుతోంది. "తనే ఆ బిడ్డకు తండ్రినని" యితరులనుండి యీ రహస్యాన్ని సంపాదించి, గుప్తపరచడం రాయచరణ్ చేసిన చురొక విధమైన తప్పు.

విద్యార్థుల భోజన వసతి గృహాలయంలో ఫైల్నా ఒక సభ్యుడుకూడా! అక్కడి విద్యార్థులంతా రాయచరణ్ దేశాచారాన్ని చూసి వింతగా — వినోదంగా ఆడిస్తూండేవారు. ఆ వినోదాల్లో అతనుకూడా కలిసిపోయేవాడు. కాని వాళ్ళ హృదయం అడుగు

భాగంలో మాత్రం ఆ మెత్తని హృదయంగల ముసలి వానిమీద అమితమైన ప్రేమభావం పేరుకొనివుంది.

ఆ నాటికంటే ఆనాటికి ముసలివాడుగా మారిపోతున్నాడు రాయచరణ్. అసంతృప్తిగా తోయడం వల్ల అతని వుద్యోగి చీటికిమాటికి తప్పులు చూపుతున్నాడు చేసిన ప్రతి పనిలోను. అందువల్ల విసిగి వేసారి వుద్యోగానికి స్వస్తి చెప్పక తప్పిందిగాదు. 'ఫైల్నా' జీవితంకోసం రాయచరణ్ పస్తుండి, జీవితం గడుపుకుంటున్నాడు. అందువలన శారీరకంగా చాలా బలహీనుడై పోయాడు. యిప్పుడు, ప్రతివస్తువు యెక్కడపెట్టాడో - యెంత తెచ్చాడో - యెలావుందో ఎంత ఖరీదో - చెప్పలేనిస్థితికి వచ్చాడు. మరుపుతనం ప్రబలింది. బుర్రంతా అనాలోచితమైపోయింది. పొలం అమ్మి తెచ్చిన డబ్బంతా హారతికర్పూరంలాగా హరించిపోయింది. 'సరియైన బట్టలు లేవని 'ఫైల్నా' సణుగుతూండటం - డబ్బుకూడా అధికంగా కోరుతూండటం అతని హృదయాన్ని మరింత పీల్చి పిప్పి చేయడంతో అగలేని బాధతో సాగిపోతోంది జీవితం. 'యిప్పుడు కావాలి'-ఎక్కడనుంచి? ఎంత? ఎవరిస్తారు?

## 3

ఇటువంటి క్లిష్ట పరిస్థితుల్లో రాయచరణ్ కేమీ తోచడంలేదు. చేస్తున్న నౌకరీకి స్వస్తిచెప్పి కొంత డబ్బుమాత్రం యెలాగో 'ఫైల్నా'కి యిచ్చి వెళ్లుతూ "సొంత పనులమీద వూరువెడుతున్నా; మరల తిరిగి త్వరలో వస్తా" నని చెప్పి బయలుదేరి అనూకుల్ మేజస్ట్రేటుగా పనిచేస్తున్న 'బరాసట్' అనే వూరికి వచ్చాడు. కుమారుని వియోగభారాన్ని మోస్తూ అనూకుల్ శ్రీమతి చాలా శుష్కించిపోయింది. ఆ కాన్పు తప్ప మళ్ళా యింతవరకు కాన్పురాలేదు.

గదిలో ఒకనాడు అనూకుల్ కోర్టులో అదేపనిగా పనిచేసి రావడంవల్ల - విసుగుతో బడలికపడి విశ్రాంతి తీసికొంటున్నాడు. శ్రీమతి వీధిగుమ్మంముందు నిలబడి శాస్త్రీయంగా వైద్య చికిత్స చేయడం తెలియని ఒక సన్యాసినుండి ఔషదమూలికను అదేపనిగా బేరమాడి అమితమైన ధరకు కొంటోంది. అది మరల యే పిల్ల వాని జన్మానికి కారణభూతమో! ముందు ఆవరణలో ఎవరిదో కంఠం "నమస్కారమన్నట్లు" ధ్వనించింది. విశ్రాంతి తీసికొంటున్న అనూకల్ 'ఎవరా!' అని చూడడానికి బయటికొచ్చాడు. చూచి చూడడంతోనే అనూకుల్ హృదయం మెత్తనైపోయింది. విశ్వాసపాత్రుడైన నౌకరు రాయచరణ్‌ని యెలా ఆహ్వానించాలో తికమక పడుతున్నాడు. కళ్ళు చెమ్మగిల్లి, కంఠం గాద్గదికమై ఎన్నో ప్రశ్నలు వెలుపలికి వచ్చాయి. మరల నౌకరీ వృత్తిలో చేరమని కోరాడు.

రాయ్‌చరణ్ మెల్లగా నిస్త్రాణమైన చిరునవ్వుతో "యజమానమ్మగార్కి నేనొక నమస్కారం చేయాలని వుంది" అన్నాడు జవాబులో.

రాయచరణ్‌తోబాటు అనూకుల్ యింట్లోకి వెళ్ళాడు. కాని శ్రీమతి, రాయచరణ్‌ని యిదివరకిటి మాదిరిగా మనఃపూర్వకంగా చేరదీయలేదు. "యీమె తనను ఆదరించలేదు." అని వేరుగాభావించాక, చేతులు మడతబెట్టి —

"అమ్మా! మీ బాబుని యెత్తుకుపోయింది పద్మ కాదు. — నేనే!!" అన్నాడు గాద్గదికంతో.

అనూకుల్ ఆశ్చర్యపడ్డాడు ఒక్కసారిగా ఉన్నట్టుండి. "ఆరి భగవంతుడా! ఆ...! ఏమిటీ...! యెక్కడున్నాడు? ఏడి?"

"అతను నాతో వున్నాడు. రేపు తర్వాతరోజు నే మీ దగ్గరకు తీసికొస్తాను." అని రాయచరణ్ చెప్పి చరచరా వీధిలోకి వెళ్ళిపోయాడు.

రాయచరణ్ మాటప్రకారం ఆ రోజున సరిగ్గా ఆదివారమైంది. అనూకుల్ కోర్టుకు పోనక్కర్లేదు. భార్యాభర్తలిద్దరూ రోడ్డుమీద జనాన్ని పరిశీలిస్తూ ఆత్రుతనయనాల్తో, రాయచరణ్ రూపంకోసం నిరీక్షిస్తున్నారు. సరిగా పదిగంటలవేళ రాయచరణ్ ఫైల్నాను వెంటబెట్టుకొచ్చాడు.

ఎటువంటిప్రశ్న వెయ్యకుండా అనూకుల్ శ్రీమతి గబాగబా పోయి ఆ కుర్రవాడ్ని ఒళ్ళోకి తీసికొని, హృదయానికి హత్తుకొని, తనలోతాను నవ్వుకోవడం-

ఒక్కొక్కసారి వుద్రేకితురాలవడం పుడుకుపుడుకున నవ్వటం-మూర్ధాన్ని మూర్కొనటం నుదురుతాకి ముద్దుపెట్టుకోవడం - మొగంలో మొగంవుంచి రెప్ప వేయక ఆకలిగొన్న కళ్ళతో ఆత్రంగా చూడటం చేస్తున్నది. 'పైల్వాన్'చూడ్డానికి వున్నత కుటుంబీ కుడిలాగా కనబడుతున్నాడు.

అనుకోకుండా హఠాత్తుగా జరిగిన యీ వుద్విగ్న పరిణామం అనూకుల్ హృదయం దాటిపోయింది. అయినప్పటికి మేజస్ట్రేటుగా —

"నిదర్శనాలేమైనా వున్నయ్యా!" — అని అడిగాడు.

"ఇటువంటి పనులు చేయడానికి యేవిధమైన నిదర్శనాలుంటయ్యో భగవంతుని కొక్కనికే తెలిసి వుండాలి. నేను తప్ప మీ కుర్రవాన్ని దొంగిలించింది మరెవ్వరూ యీ లోకంలో లేరు"—అని నిట్టూర్పు విడుస్తూనే చెప్పాడు రాయచరణ్.

ఆత్రుతతో ఆ కుర్రవాన్ని వదలకుండా భార్య వుండటం గమనించి "తనెందుకు నిదర్శనాలు కావాలంటున్నాడో"— అర్థంకాకపోయింది. తనతప్పు తనే సంబాళించుకున్నాడు. వివేకంగల బుద్ధిమంతునికి అదొక లక్షణం నమ్మడం అనేది. అప్పుడు తన్నెదుర్కొనేవి మరి రెండుప్రశ్నలు: మొదటిది 'ముసలివాడైన రాయచరణ్ యీ సమయంలో కుర్రవాన్ని యెక్కన్నుంచి తీసికొచ్చాడు. "ఏమీ లేనిదానికి యింతగా హంగామాచేసి, ఎందుకు మోసంచేసి వుంటాడు" యిది రెండవది.

"కాని" అంటూ వుద్రేకితుడై నిర్లక్ష్యంగా "రాయచరణ్! యిక నువ్వు యిక్కడ వుండక్కర్లేదు" అన్నాడు.

ఊపిరి సలపని కంఠంతో — చేతులు కట్టుకొని దీనంగా- "ఎక్కడకు వెళ్ళమంటారు...ముసలివాణ్నైనాను. ఎవరు తీసికోగల్గుతారు మరల నౌకరిలోకైనా!" అనిప్రాధేయపడ్డాడు.

"ఉండనిద్దురూ! నా బిడ్డ నాకు సంతోషంగా వుండటమే చాలు, నే క్షమించానండీ" అంది అనూకుల్ శ్రీమతి కరుణాత్మకంగా.

కాని న్యాయాధిపతి అనూకుల్ మాత్రం ఈ విషయం అంగీకరించలేక పోయాడు.

"వీల్లేదు - యీ విధంగా చేసినందుకు క్షమించదగినవాడు కాడు" అని వుద్రేకంగా ఆజ్ఞ జారీ చేసాడు.

"బాబూ! నన్నుండనివ్వండి, యదార్థంగా నే చేసిందికాదు. ఆ సంగతి భగవంతుడుకే తెలియాలి" అని ప్రార్థించుతున్నాడు.

అనూకుల్ హృదయం గడ్డకట్టడమే జరిగితే, మరల సాధారణదశలోకి రావడమంటే చాలా కష్టమైన విషయం. అందులో రాయచరణ్ తన తప్పిదనాన్ని భగవంతుని భుజాలపై మోపడం వింటుంటే మరీ వుక్రోషితుడై పోతున్నాడు.

"నేను నిన్ను యే విధంగానూ నమ్మను - నువ్వు నా యింట్లో వుంటానికి తావులేదు. — అలా జరగడానికి కూడా వీల్లేదు" అంటూ అనూకుల్, రాయచరణ్‌ను నానా విధాలుగా బ్రతిమాలుతున్నా, శరణ్యం కోరుతున్నా అనేకమాటలన్నాడు.

రాయచరణ్ అతని పాదాలపైనుండి లేచి — "నేనుకాదు - ఆ పని ఎవరో చేసారు!" అని చెప్పుతున్నాడు. ముడతలుపడిన చెక్కిళ్ళపై కన్నీటి కణాలు జారువాలుతున్నయి. శరీరమంతా కంపించిపోతోంది. చేతిలో కర్ర వూరికే వూగిసలాడుతోంది.

"ఎవరూ" - అనూకుల్ వురిమాడు.

"అది నా నుదిటిమీది విధివ్రాత" అని జవాబిచ్చుకున్నాడు.

కాని యిది చదువుకొన్న యే వ్యక్తి క్షమాపణగా తీసికోలేదు. కాని అనూకుల్ అది కఠినత్వంతో కూడిన మనస్సుమాత్రం యింకా మిగుల్చుకున్నాడు.

'పైల్నా' యెప్పుడైతే తను రాయచరణ్ కొడుకు కాదని, ఒక వున్నత కుటుంబీకుడైన మేజస్ట్రేట్ కుమారుడనని విషయమంతా అవగాహనచేసుకున్నాడో - మొదట్లో తనుకూడా చాలా కోపోద్దీపితుడైనాడు. తన జన్మ హక్కుకోసం తానెంత మోసగించబడిందీ అర్థం చేసుకొన్నాడు. కాని రాయచరణ్ దురవస్థ చూస్తూండేటప్పటికి, తన్నే విధంగా పెంచిందీ, తనకోసం యెంత కష్టపడిందీ ఆ విషయ చూచికంతా గుర్తుకొచ్చి – తండ్రితో –

"నాన్నా! క్షమించండి ఒకవేళ అతను మనతో మనింట్లో వుండటం యిష్టంలేకపోతే, పోనీ! 'నెల కింతని' యేర్పాటుచేసి భరణంగా యివ్వడం బాగుంటుంది" అనిచెప్పి ఒప్పించాడు.

ఋణం తీర్చుకున్న రాయచరణ్ యీ మాటలు విని యేం మాట్లాడలేదు. ఆఖరిసారిమాత్రం అతని కొడుకు మొగం తనివిదీర చూసాడు. కడుపు తరుక్కుపోయింది. బిగ్గరగా ఏడ్పువచ్చింది. కాని వెలుపలికి కక్కలేక అదుముకున్నాడు. ఒక్కసారిగా అనూకుల్ - అతని శ్రీమతికి నమస్కారంచేసి మెల్లిగా – తనలో తను

"ఎలాగో మీ ఋణం తీర్చుకోగలిగా –.

తప్పునామీద తెలిసికోకుండా ఆపాదించినందుకు" అంటూ బయటికి వచ్చేసి అశేష ప్రజానీకంతో అలుముకుపోయిన జగత్తులో కలిసిపోయాడు... ఎక్కడికి?

నెలాంతంలో అనూకుల్ కొంత డబ్బుమాత్రం రాయచరణ్ గ్రామానికి అతనిపేరిట పంపాడు. రాయచరణ్ పేరుగల వ్యక్తి ఆ వూళ్ళో లేకపోవడంతో తిరిగివచ్చిన డబ్బుచూసి నిశ్చేష్టితులైనారు.

# సిరిసిరిమువ్వలు

కొడుకు:-నాన్నా ! నీవు కళ్లు మూసుకొని సంతకం చేయగలవా ?

తండ్రి:-ఓ ...

కొడుకు: అయితే నాన్నా ! యీ ప్రోగ్రెస్ రిపోర్టుమీద కండ్లుమూసుకొని సంతకం చెయ్యి చూద్దాం !

♦ ♦ ♦

కొట్టుయజమాని:-బాబూ ! పై కా ని కి చాల యిబ్బందిగా నున్నది-రేపు తప్ప కుండా అప్పు తీర్చేయండి.

అతడు:-డబ్బులో ఏముందోయ్-మాటలో ఉంది కాని.

'రామ్‌శ్రీ'

♦ ♦ ♦

స్పీడుగా పోతూయున్న మోటారుకారు ఆగిపోగా అందులోని యజమాని "డ్రైవర్ ! ఎందుకూ కారాగిపోయింది" అని అడిగాడు.

"నది అడ్డం వచ్చింది"

"అయితే హారన్ కొట్టలేకపోయావా-అదే తొలిగిపోతుంది!"

♦ ♦ ♦

ఒకసారి హాలీవుడ్‌లో పత్రికా విలేఖరులకొక చలన చిత్రం ప్రదర్శించబడిన సందర్భమున ఆ చిత్రానికి దర్శకత్వము వహించినాయన విలేఖరులతో మాట్లాడుతూ "మీరు మీ మీ యభిప్రాయాలిస్తే అవసరమయినచోట కత్తిరింపులు చేయవచ్చు"నన్నారు.

అందులో ఒక విలేఖరి "అంతా బాగున్నది. ఈ చిత్రంలో డైరెక్టరు, హీరోయిన్ గొంతుకలు కత్తిరించితే బాగుంటుంది" అన్నాడట.

♦ ♦ ♦

"తమ దేవూరండి !"

"నెల్లూరు"

"ఏంచేస్తుంటారు"

"ప్రతిదినం వేలకు వేలు రూపాయలు పంచిపెడ్తుంటాను"

"అబ్బా ! అబ్బా ! ఎంత ధర్మాత్ములండి!-ఏమాత్రం ఆస్తిపరులేమిటి మీరు"

"అబ్బే - నేను ఆంధ్ర బ్యాంకులో క్యాషియర్‌నండీ"

♦ ♦ ♦

"ఏమయ్యా ! మంచిది కొబ్బరినూనె వుందా మీ దగ్గర."

"ఉందండీ - యిది వీశ 2-8-0, అది రు 3-0-0."

"వీటిలో తేడా ఏమిటో చెప్పగలరా"

"ఇది నువ్వులనూనె కలిపింది ; అది వేరుశనగనూనె కలిపింది - తమకేది కావాలి"

'అర్జునుడు'

జర్మను ఏకాంకిక

# ఏకోదరులు

| రచయిత : | అనువాదకుడు : |
|---|---|
| గోథేమహాకవి | డాక్టరు వి. ఎన్. శర్మ |

(గతసంచిక తరువాయి)

విల్ :—చార్లాట యోగ్యురాలు. సంసారాన్నంతా ఎంతో చక్కగా దిద్దుకొని వెళ్ళింది. తన మనో భావాలను తెలపడానికి వుత్తరాలను రాయట మంటే చార్లాటాకు ఎంతో సరదా. చార్లాటా రాసిన వుత్తరాల్లను నిన్ననే తిరిగీ చదివే అదృష్టం కలిగింది.......చార్లాటా యోగ్యతను చక్కగా తెలుసుకొన్నవాళ్లలో నీ వొక్కడివే.

(బల్లమీదవున్న బంగీవంక తదేకదృష్టితో చూస్తూ వుంటాడు)

ఫాబ్రిస్ :—(తనలో) ఇలా చెప్తాడెందుకు? ఆ సంగతినే ఎన్నోసార్లు ఈయనే చెప్పలేదూ మరి?... ఇంకా వినడానికి నాకెందుకు విసుకు వుంటుంది? ఆవిడంటే ఈయనకు ఎంతో ప్రేమ ... అయితే ఏమైంది? ... నేను వచ్చినపని ఈయనకు చెప్ప వచ్చునా? ఆయన ఎంతో ఆనందంలోవున్నాడు ... కాని, ఆ విషయాన్ని గురించి ఈయన్ని ఇప్పుడు తొందరపెట్టొచ్చునా?

విల్ :—మొట్ట మొదటిసారి ఆ దూర దేశంలో కలుసుకొన్న తరువాత ఈ వుత్తరాన్ని చార్లాటా రాసింది. "ప్రేమ, ప్రేమ. అదే నన్నీలోకాన తరింపచేసింది. నన్ను ఎవ్వరూ ప్రేమించరను కొన్నాను, ఆ రోజుల్లో నేనుపడ్డ బాధలను తలంచుకొంటే గుండె గభీలుమనిపోతుంది ... ... నా జీవితమే పూర్తిగా మన్నుపాలైందను కొన్నాను ...నీవు జీవితంలో అడుగుపెట్టావు. అధోలోకాన్నుంచి పైకి దీసుకొనివచ్చి నన్ను రక్షించావు... ప్రారంభంలో నాకే భయంవేసింది. హృదయాంతరాళాలూ కంపించిపోయాయి ... నీవు కూడా ఎన్నో కష్ట పరంపరలనుదెచ్చి పెట్టుతున్నానని భయపడ్డాను. తరువాత నీవు వెళ్లాలిసివచ్చింది... అర్ధ సంవత్సరకాలం ... ఏలా అనగల్గి వుండ గల్గానో? ... తుపాను వీచింది, భూకంపాలు వచ్చాయి...ఇక చావే మంచిదనుకొన్నాను. ఈ గుట్ట మెట్టలనుండి ఏలా బయటబడగల్గుతానో... కాని ఆ తుపాన్లు, ఆ భూకంపాలు అదృశ్యమయి పొయ్యాయి...ఇక ఎందుకు భయపడాలి?...నీవు వున్నావుకాదూ నాకు మనశ్శాంతి నిస్తానికి..."

ఫాబ్రిస్ :—ఔను. దొడ్డరాలు! బహు ధైర్యసాహసాలు గల ఇల్లాలు.

విల్ :—ఆవిడే నన్నూ పావనంచేసింది. ఆవిడ ప్రేమ వల్లే ఇప్పుడు మనుష్యమాత్రుడ్నిగా వుండగల్గానని నీకూ ఎన్నోసార్లు చెప్పానుగాదూ! పోయింది, నా చార్లాటా, నా హృదయేశ్వరీ?...మా పెద్దలు సంపాదించి ఇచ్చిన ఆస్తిపాస్తులను పాడుచేసు కొన్నాను. ఆకాలంలో నే పడ్డ అవస్థల్ని ఎలా చెప్పకోడం ... చార్లాటా ఇంటికివచ్చింది. ఏలా ఈ సంసారాన్ని నడుపుకో గలుగుతుంది? ఆ రోజుల్లో చార్లాటా ఎంత బాధపడ్డది పాపం?... కాని అన్నిటికీ ధైర్యంతోవోర్చింది. ఇక నా జీవిత యాత్ర నెలా నడుపుకోవాలి? ఆ దినదిన గండాల నుండి ఏలా తప్పించుకోవాలి?...చార్లాటాప్రేమ నా జీవితాన్ని పూర్తిగా మార్చివేసింది. కష్టపడి పనిచేశాను. అన్ని కష్టాల్లో చార్లాటా నాకు ధైర్యాన్ని ఇచ్చింది ... ఒక సంవత్సరం ఈలా గడపాలసివచ్చింది...సూర్యుడు ఉదయించాడు. నన్నీ అవస్థలోనుండి పైకి లేవదీశాడు. ముందుకు నడిచాను. ఆ ఆశాకిరణాల సహాయ్యంతోనేకాదుమరి? ... నా జీవితరథాన్ని మళ్లా ఎగుడుదిగుడులేని దోవలోనే నడపగల్గాను ... ఆ

లక్ష్మి ఏదీ మరి? పోయింది. మటు మాయమయి పోయింది. చార్లొటా పోయాక ఇక ఎందుకు జీవించివుండడం అని ... ఆమె పొయ్యాక నేను పడ్డబాధలు నీకేం తెలుసు? ... నా ప్రాణం చార్లొటా ప్రాణంతో ఐక్యమయిపోయింది. నా ప్రాణం ఆమెతోనే పోయింది. చార్లొటా పోయాక ఈ ప్రపంచం, ఈ వ్యాపారం ఇక నాకెందుకు మరి?... వెలుపలికే రాలేకపోయాను. ఆమె కళేబరాన్ని చూడలేకపోయాను. ఆ సమాధినే ఇక ఎలా చూడగల్గుతాను ... తనకు అంత్యకాలం సమీపించిందని చార్లొటా తెలుసుకొన్నది. ఆ సమయంలోనే ఈ వుత్తరాన్ని రాసి నన్ను విడిచి ఆ ఆనందలోకానికి తరలిపోయింది.

(డ్రాయరులోనుండి ఆ ఉత్తరాన్ని తీసాడు. దాన్ని ఫ్రాబిసుకు చూపాడు.)

ఫ్రాబిస్:_ఔను. ఆ వుత్తరాన్ని క్రిందటిసారి నాకు చూపించావు...అంతా సరేకాని...

విల్:_ఆ వుత్తరంలోని విషయాల్ని కంఠపాఠంగా వప్పచెప్పగలన్ను. దీన్నిచూచానా, చార్లొటా నా ఎదుటే వున్నట్లే వుంటుంది ... చార్లొటా చిరంజీవి. చచ్చిపోలేదు. ఇదిగో ఇక్కడ్నేవుంది ... (వెలుపల ఒక కుర్రవాడి అరపు వినబడుతుంది) ఆ కుర్రవాడు తనదగ్గిరే వుండకపోతే మరియానా ఒక నిమిషమైనా వుండలేదు. వాడు మా పొరుగింటి అబ్బాయి. వాడు ఎప్పుడూ ఇక్కడే వుండిపోతాడు. వాడు చెప్పేకబుర్లు వినాలి. అల్లరి చెయ్యాలి. అప్పుడే దానికిఆనందం, వుత్సాహం. (లోపలి తలుపును తెరుస్తాడు.)

ఇదిగో మరియానా వాడు అలా అల్లరిచేస్తుంటే.. వాడ్ని ఇంటికి పంపెయ్యి. ఆ అల్లరివల్ల ఇక్కడ మేమెలా మాటల్ను చక్కబెట్టుకోగలం? ఇంతకూ వాడీలా అల్లరి ఎందుకు చేస్తున్నాడో చెప్పు ... (తిరిగివచ్చి తన స్థలాన్న కూర్చుంటాడు.)

ఫ్రాబిస్:_(శాంతంతో) విల్ హేం, నీకూ కొంచెం ధైర్యం వుండాలి. ఆ పాతదినాల్ని తల్చుకొంటూ అలా బాధపడ్తూవుంటే, శాంతం, ధైర్యం ఏలా వస్తుంది? వాటిని మరిచిపోవడం మంచిది.

విల్:_ఆ వుత్తరాన్నేకాదు. ఇంకా ఎన్నో జాబులనురాసింది అంత్యదినాల్లో...ఇదే నా చార్లొటా కడపటి వుత్తరం...

(ఉత్తరాలన్నింటినీ ఫ్రాబిస్‌కు చూపి తిరిగీ వాటిని డ్రాయర్లో చక్కగా అమర్చుతాడు)

ఔను, నువ్వుచెప్పేది నిజమే. నాయీ అయోమయావస్థ ఏ మాత్రమూ మంచిదిగాదు. అలా చార్లొటాను ఎప్పుడూ తలంచుకొంటూవుండే నాకు శాంతి ఎలా వస్తుంది మరి?...కాని ఏంచెయ్యాలి? ఈ గదిలో కూర్చుంటే ఆ విషయాలే నన్నాందోళనంలో నింపుతాయి...

ఫ్రాబిస్:_ఔను. నిన్నుచూస్తే నాకే ఎంతో విచారం వేస్తుంది. అంతా దైవవిధి. ఆ విధి తన కార్యకలాపాన్ని కొనసాగించింది. దానికి మనం దాసానుదాసులం కాగూడదు. ఆమెపోయినా ఆవిడ బిడ్డవుంది. నీవీలా బాధపడ్తూవుంటే ఆ పిల్లకు ఆనందం వుంటుందా? ఈ బాధలను ఆ పిల్లకూ చెప్పుతూ దాన్ని బాధపెట్టితే లాభం వుంటుందా? ఈ దుఃఖాన్ని, ఈ బాధల్ని, మరిచిపోవాలి ... అథవా ఆ పిల్లకోసం అయినా వాటిని పూర్తిగా మరచిపోవాలి?

విల్:_(పెచ్చి పెరిగిపోతూ వస్తూవున్న దుఃఖాన్ని కొంత దిగమ్రింగుకొని) ఔను. చార్లొటా కన్న బిడ్డ నా మరియానా! ఆమె ప్రాణమే ఇది... దీన్ని అనాథనుచేసి అదృశ్యమయిపోయింది. విధి ఈలాగుంది. మనం ఏం చెయ్యగలం? అయితేనేం

... ఈ సంగతిని ఎందుకు చెప్పొచ్చానంటే ...

ఫ్రాబిస్:_సరేలే. ఆ సంగతిని నీవు చెప్పనక్కరలేదు.

నీ హృదయం ఆ భారంతో నిండివుంది...

విల్:—ఈ భారాన్నుండి విముక్తి పొందడం అంత సులభమనుకున్నావా మరి?

(ఇంతలో మరియానా కుర్రవాడ్ని వెంటబెట్టుకొని గదిలోకి ప్రవేశించుతుంది)

మరి:—ఇంటికి వెళ్లడానికిముందు నీతో చెప్పటానికే వచ్చాడు. నీతో ఆనందంగా వుండకపోయినా ఫరవాలేదు. వీణ్ని కొంచెం బుజ్జగించి మరి పంపాలి. పెండ్లిచేసుకోవాలెనని గంపెడు పిల్లలు కావలెనని అంటూవుంటావే. పిల్లలు-పిల్లలెప్పుడూ తాళ్లమీదే కూర్చుంటారు. అల్లరిచేయడం వారి స్వభావం ... నిన్ను తొందరపెట్టి నీ పనిపాటల్ను చెడగొట్టకవుంటే చాలు ...

విల్:—(కోపంతో) నా బిడ్డలయితే ఫరవాలేదు...

మరి:—(కోపంతో) అన్నయ్యా! ఎందుకు ఇంత భేదం చూపాలి?

ఫాబ్రిస్:—అంటే నీ అభిప్రాయమేం? దాన్ని చెప్పాలి మరియానా?

మరి:—అదేమీ సొంపుగా వుండదు, వివరించటానికి ఆరంభిస్తే. (బిడ్డను లాలించుతూ ముద్దుపెట్టుకొంటుంది) ... వీడంటే నాకెక్కడలేని ప్రేమ. వీడే నాబిడ్డ అయివుంటేనో?.. అంత అదృష్టమా నాకు మరి?...వీడు బాగా రాస్తాడు. పుస్తకాలను నేర్పుతో చదువుతాడు. అంతా నాదగ్గర్నే నేర్చుకొన్నాడు...

విల్:—ఆ సంగత్ని నాకు చెప్పావుకాదే? ఎప్పుడు దీన్నంతా నేర్చుకొన్నాడు?

మరి:—ఆ సంగత్ని చెప్పితే కోపపడ్తావని ... అంతా నాదగ్గర్నే...చదవడం రాయడంమాత్రమేకాదు. దుస్తులను విప్పుకోడం, కట్టుకోడం బాగాతెలుసు. వాడు చిన్నపిల్లవాడయినా! అంతేనా! ఇంట్లో పనులన్నీ చక్కగాచేస్తూ నాకు సహాయం చేస్తూ వుంటాడు.

ఫాబ్రిస్:—ఆలా అయితే వాళ్లనాయనా, అమ్మా ఏంచేస్తూ వుంటారు?

మరి:—వాళ్ళూ వాడితో ఆట్లాడుతారు. నేను వాడ్ని ప్రేమించినట్లే ఎంతో గారాబంతో వీణ్ని ప్రేమిస్తారు. ఇక వాడు ఇంటికివెళ్ళాలి. ఆ సంగత్ని నీతో చెప్పటానికి వచ్చాడు.

(కుర్రవాడ్ని విల్‌హెం చెంతకు తీసుకొని పోతుంది)

అన్నయ్యా! నీ చేతిని వాడికియ్యాలి. ఒక మంచి మాట వాడికి చెప్పు.

ఫాబ్రిస్:—(తనలో) ఈ పిల్లను చూస్తూవుంటుంటే... ఈ సంగతినే చెప్పాలి...

మరి-(వాడ్ని ఫాబ్రిస్ దగ్గరకు తీసుకొనివస్తుంది) ఇదిగో ఈయనా మనమామయ్యే. ఆయనకు నమస్కారం చెయ్యి.

విల్:-(తనలో) మరియానా నీదే అవుతుందిలే! అది నీదే ... అలా అవుతుందా మరి? అంత భాగ్యం మాకు వస్తుందా?... (కొంచెం కోపాన్ని నటిస్తూ) మరియానా, వాడ్ని ఇంటికి పంపెయ్యాలి. ఈయన మనల్ని చూస్తానికి వచ్చాడు. కొంచెం సేపయినా విశ్రాంతిగా ఆయనతో మాట్లాడుతూ వుండాలి. తొందరగా వాడ్ని ఇంట్లో వదిలిపెట్టిరా. నాకూ బయట కొంత పనివుంది. దాన్ని చక్కబెట్టుకొని ఒక్కక్షణంలో తిరిగివస్తాను.

(మరియానా పిల్లవాడ్ని తీసుకొని వెళ్ళుతుంది)

విల్:—ఫాబ్రిస్! కొంచెంసేపు ఆ పుస్తకాల్లను చూస్తూ వుండు. ప్రొద్దుటినుండి ఇక్కడ కూర్చున్నాను. ఒక్కసారి గాలిని పీల్చడానికి బయటికి వెళ్ళివస్తాను ... ఇవ్వాళ ఎందుకు చెప్పమూ నా హృదయ భారం పూర్తిగా మటుమాయమైపోయింది. క్షమించాలి, ఇప్పుడే వస్తాను.

(బయటికి వెళ్లుతాడు)

(సశేషము)

# సంపూర్ణ జీవనానికి సాధనములు

## మనశ్శాంతి—ప్రపంచశాంతి

శ్రీమతి నెమలి చంద్రమతిదేవి

—o—

సర్వజన మనశ్శాంతే ప్రపంచశాంతి. మనసులోనున్న రెండు శక్తులు మంచి చెడ్డలు. వివేకావివేకములు. ఒకటితో నొకటి పోరాటము సదా సర్వకాలము మనసులో జరుగుచునే యుండును. ఇదే యుద్ధము-మానవునిలోనే, యుద్ధభూమి, ఇఱు తెగల సమూహములు అన్నియు వున్నవి. చెడుగుణములు, ధనాపేక్ష, అధికారము, ఒకరి దేశము నపహరింపవలెనన్న పేరాశ, చూపోపమి, ఇవే ప్రపంచములో యుద్ధములకు కారణములగుచున్నవి.

ప్రజల రక్తపాతంవల్ల కట్టబడిన రాజ్యం ధర్మరాజ్య మెట్లగును? ఆటంబాంబులు, హైడ్రోజన బాంబులు ఒకటిని మించిన దొకటి దేశదేశాలవారు తయారుచేయుచున్నారు. ప్రాణికోటిని పీనుగుల పెంటగ చేసి, పట్టణముల మంటిపాలు గావించి, ఎంతజననష్టం, ఎంత ద్రవ్యనష్టం కలిగించెదరో ఎవరికెఱుక?

దైవసంకల్పమువలన కలుగుచున్న భూకంపములు, వరదలువచ్చి, జననష్టం, ద్రవ్యనష్టం కలుగుతున్నదని చింతించు టెందులకు? మానవాధీనములోనున్న యుద్ధములనే నివారింపలేనప్పుడు వాటికి వగచి ప్రయోజనమేమున్నది? ప్రపంచ శాంతికలుగుటకు ఒకటే ఉపాయమేటనిన, వారివారిలోనున్న చెడుతలంపులను మొలకెత్తనీయక చంపివేయుట. బౌద్ధమతము, గాంధీతత్వము "అహింసా పరమోధర్మః" అను సిద్ధాంతమును ప్రబోధించునవి.

ఎవరినివారే ఆత్మపరీక్ష చేసుకొని దిద్దుకొనుట మంచిది. మనస్సే జగము, జగమే మనస్సు.

శ్రీ రమణమహర్షి దగ్గఱకు, ఒక పాశ్చాత్య భక్తుడువెళ్ళి మాటల సందర్భమున నిట్లడిగెను.

"స్వామీ ప్రపంచ మల్లకల్లోలముగ నున్నదే ఏమగునో."

మహర్షి:-"వర్తమానస్థితే నీకు బాగా తెలియదే, ఇక భావిస్థితినిగూర్చి నీకీ విచారమెందుకు? ప్రస్తుత స్థితినిగూర్చి తెలుసుకొన్న జాలును. రాబోవుగతికూడ వెంటనే తెలియగలద"ని చెప్పిరి-

కాని మరల అతడు ఇట్లడిగెను:- "ప్రపంచములో సహకారము, సామ

రస్యము, ఎక్కువగునా లేక యుద్ధము వచ్చి, కల్లోలమైపోవునా ?''

మహర్షి :-''ప్రపంచమునకు ప్రభువొక డున్నాడుకదా ? ప్రపంచ రక్షణను ఆయన చేసుకోలేడా ? ప్రపంచము సృష్టించిన వాడే దానిని కాపాడుకొన తెలిసిన వాడును. ఆ భారము వహించునది ఆయన కాని నీవు కాదుకదా ?''

భక్తుడు:-''కాని, చుట్టును ఎక్కడ చూచిన, ఆయన ప్రేమ, కృపలున్న చోటు కనుపించుటలేదే ?''

మహర్షి :-''నీవెట్లో ప్రపంచమునట్లే, నిన్ను నీవు అర్ధముచేసుకొనక ప్రపంచము నర్ధముచేసుకొనజూచిన ఏమిలాభము ? సత్యాన్వేషులీప్రశ్న నాలోచింప నవసరమేలేదు. వృధాయాసము. నీలోని నిజము తెలుసుకొనిన, నీవొక భాగమయిన ఈ ప్రపంచములోనున్న సత్య మర్ధము చేసుకొనుటకు, కొంత వీలుపడును.'' ఇట్లు ఎందరో రమణమహర్షి సమక్షమున శాంతి మనస్కులైరి. ఆయన నోరుతెఱచి చెప్ప నక్కరలేకనే, ఆ నిశ్శబ్దతలోనే మనసు శాంతియుతమగుచుండెను. ఎన్నో దివ్యానుభవములు పొందుచుండిరి.

ఆ పాశ్చాత్య భక్తుడు తిరిగి తన దేశము వెడలునప్పుడు మహర్షి ఇట్లు చెప్పిరట. ''నీవే దేశమునకు వెళ్లినను, ఇప్పుడు నీకున్న శాంతి అక్కడను, స్థిరముగ నుండును; కాని నీపై నింకొక భారమున్నది నీవు ''నేను నాది. అను అహంభావన వీడవలెను. ఈ శాంతి నీకు లభించి, నిలుచుటకు, నీ యహంకార పూరిత జీవితము మఱవవలెను'' అనిరి.

సర్వజన మనశ్శాంతే, ప్రపంచ శాంతికి కారణము. అన్ని దేశములవారును, అసూయ అహంకారము, అధికాశ, ఇవి వదలి, ఒకరితో నొకరు స్నేహభావము కలిగి, అహింస అనే పరమధర్మాన్ని ఆచరణలో పెట్టిన, లోకమంతా శాంతి నిలయమగును. సర్వమానవప్రేమే, అత్యవసరం. ప్రేమే భగవంతుడు. భగవంతుడే ప్రేమ.

సంపూర్ణ, శాశ్వత లోకశాంతిని త్వరలో పరమేశ్వరుడనుగ్రహించుగాక !








## రబ్రి

$2\frac{1}{2}$ సౌనుల పాలను $\frac{1}{2}$ సౌను అగువరకు మరగ కాచవలెను. తర్వాత దానిలో ఆరు టేబిలు స్పూనుల చక్కెరవేసి బాగా కలుపుము. కొంచము సేపయిన తరువాత చల్లారిన దానిమీద పన్నీరు కొద్దిగా చల్లి భుజించవలెను.

'లిల్లీ'

## బంగాళా దుంపలవడ

బంగాళా దుంపలను ఉడకబెట్టి తొక్కతీసి వుంచవలెను. శనగపప్పును నానిన వానిని పరిమితంగా ఉప్పువేసి బాగుగా రుబ్బుకొని సన్నగా తరిగిన జీడిపప్పులను, అల్లం, పచ్చిమిరపకాయ ముక్కలను, వేరు శనకపప్పులను, కరివేపాకును వేసి బాగుగ కలుపవలెను. దాంతోటి తొక్కతీసి యుంచుకొనిన బంగాళా దుంపలనుకూడ వేసి కలిపి మొత్తం మెత్తగా కలిపి చిన్నచిన్న వడలుగా తట్టి నూనెలో కాల్చవలెను. ఇవి తినుటకు చాల రుచిగా నుండును.

'వినత'

## పనసపండు పాయసం

బాగా పండిన పనసపండు తొనలను గింజలు తీసివేసి వెడల్పాటి కళాయి గిన్నెలోవేసి నీళ్ళుపోసి పొయిమీద నుంచవలెను. అందులోని నీరంతా యిగిరిపోయేదాక ఉడకబెట్టాలి. ఉడికినది ముద్దగా దోర రంగుకలిగి హల్వాలాగగును. అందులో యింకా తియ్యగా నుండేందుకు సరిపడ్డ బెల్లం పొడిచేసివేసి బాగా కలియబెడుతూ ముద్దయ్యేదాక ఉడకనివ్వవలెను. నీరంతా యిగిరిపోయిన తర్వాత, ఆ హల్వాకు సరిపడ్డ వెన్నగాని, నెయ్యిగాని వేసి బాగా కలియబెట్టవలెను. ఆ నెయ్యి అంతా క్రమంగా ఇంకిపోయేదాకా పొయ్యిమీద వుంచి కలియబెట్టాలి. దీనిని జాడీలలో నిల్వయుంచుకొనినచో ఒక సంవత్సరముండును. ఈ పనసపండు పాయసం చేయడానికి కొబ్బరి పాలనే వుపయోగించాలి. మనంచేసే పాయసాన్నిబట్టి కొబ్బరి కాయలు తీసుకొని తురిమి పాలు తీయాలి. మొదటిసారి తీసినవి అలాగేవుంచి, రెండోసారి, మూడోసారి తీసినపాలు మొదట వాడాలి. ఈ పాయసం చేయడానికి కావలసినంత ఈ హల్వాముద్దను ఒక వెడల్పాటి కళాయి గిన్నెలోకి తీసికొని రెండవ, మూడవసార్లుతీసిన కొబ్బరిపాలను అందులోపోసి పొయిమీద పెట్టవలెను. దానిని కలియబెడుతూ యుండిన ఆ ముద్దపాలతో కలిసిపోయి కుతకుతమని ఉడుకుతుంది. పాయసం బాగా కాగిన తరువాత మొదటిసారి తీసియుంచిన చిక్కని కొబ్బరిపాలను అందులో పోయవలెను. రెండు మూడు ఉడుకులురాగానే దించేయవచ్చును. అందులో జీడిపప్పులకు బదులుగా కేరళదేశంలో చిన్న చిన్నవిగా తరిగిన పచ్చికొబ్బరి ముక్కలను నేతిలో ఎర్రగా వేయించి వేస్తారు. ఇది చాల రుచిగా వుంటుంది.

యం. సుశీలాదేవి




# వీరబాల

శ్రీ పిల్లా సుబ్బారావుశాస్త్రి

(గతసంచిక తరువాయి)

తర్వాత ఆ అమ్మాయి యిలా చెప్పింది.

"సుందరీ! అసలు అది నిజంగా ఉమాదేవి అనే అమ్మాయికాదు. అదొక భూతం. దాని కూతురు పోయినప్పటినుండీ యిలా రాకుమార్తెల తేవడం, కొన్నాళ్ళు పెంచి ఏ పక్షిగానో మార్చేస్తూండడం అలవాటయిపోయింది. అయితే నీకు దోవలో కనబడ్డ వన్నీ నీలాటి రాకుమార్తెలే!" అని చెప్పింది.

"ఇలారా!" అంది సుందరి. "అమ్మో! అది వచ్చిందంటే చంపేస్తుంది—కాని నువ్వొక పనిచెయ్యి. రేపు అది వచ్చినతర్వాత నేనొక్కర్తినే పడుకోలేను. సాయంకావలను. ఎవరుకావాలంటే సింహం కావా లని చెప్పు" అని వుపాయం చెప్పింది.

సుందరి సరేనని ఏమీ ఎరుగనట్లు వెళ్ళిపడుకుంది.

మర్నాడు బాలసుందరి ఉమాదేవిని "ఉమా! నువ్వు రోజూ ఎక్కడికి వెళ్తున్నావ్?" అని అడిగింది.

"ఎక్కడికా?... మా అమ్మదగ్గరికి; మా అమ్మ ఆకాశగదిలో వుంది. అక్కడికి" అంది ఉమాదేవి.

"మరి నాకేమో భయంవేస్తోంది! ఎవరినైనా సాయంపెడ్దూ!"

"ఎవరిని పెట్టనూ? — హంసల్ని పెట్టనా?"

"అహాఁ! హంసలొద్దు!"

"చిలుకల్ని పెట్టనా? అవి బాగుంటాయిగా!"

"ఎబ్బే! అవి బాగుండవు! భయంకరమైన దాన్ని పెట్టు"

"భయంకరమైనదా?... ఏముంది!... ఆఁ ... సింహాన్ని పెట్టనా?"

"ఆఁ... పెట్టు! అదయితే ఎవరొచ్చినా చంపి పారేస్తుంది."

"పిచ్చిపిల్లా! ఇక్కడ కెవరొస్తారు? ఇదే మయినా భగవత్ సృష్టి అయితేనా! వచ్చేందుకు!— చీకటి పెద్దాజీ భూతం నిర్మాణం! దీన్ని జయించే వారు మూడులోకాల్లోనూ లేరు!" అని అనుకుంది మనస్సులో. అవును మరి! అది దాని మంత్రశక్తివల్ల ఒక చంద్రలోకం నిర్మించింది! (సశేషం)

---

## చమ్రియాటాకీ డిస్ట్రిబ్యూటర్స రజితోత్సవము

ప్రసిద్ధ తెలుగు, తమిళ, హిందీ, మళయాళం మున్నగు అనేక భాషలలో చిత్రములను ప్రేక్షకులకు దక్షిణ భారతంలో అందచేస్తున్న చమ్రియాటాకీ డిస్ట్రిబ్యూటర్స్వారు వివిధ శాఖలలో యీ సంవత్సరము రజితోత్సవము జరుపుకొనుచుండుట అభినందనీయము.

ఫిలిం పరిశ్రమ అనేక ఒడిదుడుకులతో కూడుకొని యున్నప్పటికీ యీ సంస్థ 25 సంవత్సరములనుండి నిర్విఘ్నముగా దినదిన ప్రవర్థమానమగుచు, దక్షిణ భారతంలో సర్వప్రజానీకపు ఆదరాభిమానములకు పాత్రమగుచుండుట ప్రశంసనీయము.

# భగ్న హృదయిని

మూలం :
నరేంద్రనాద్ బాసు

అనుసరణ :
"అర్జునుడు"

"నీ వింత పెద్దపొరబాటు కలలోనైనా చేస్తావనుకోలేదు. రమా! - ఛా! ఛా!" అన్నాడు లక్ష్మీపతి.

ఆ మాటలు భార్య రమాదేవి నుద్దేశించి పలికినవి - ఆ రోజు ఉదయం ఆమె ఆరు సంవత్సరాల ప్రాయంగల కొడుకు చంద్రబాబుతో నదీ స్నానానికి వెళ్ళినప్పుడు జరిగిన సంఘటనగూర్చి అన్నవే - ఆ మాటలు. చంద్రబాబు ఆ దంపతులకు ఒక్కగాను ఒక్క కొడుకు. లక్ష్మీపతిగారు సౌమ్యుడు. అతను నవీన పద్ధతులకు అలవడినా, యింటిలో పెద్దవారంతా సనాతనులే. అందులోను మంచి ధనవంతులు.

ఆ రోజు వుదయం రమాదేవి కొడుకుతోగూడా ప్రాతఃస్నానానికి నదికివెళ్ళింది. నదిలో స్నానమాచరిస్తూ చంద్రబాబు ప్రమాదవశాత్తున నదీ ప్రవాహంలో పడిపోయాడు. అప్పుడు రమాదేవి అతన్నికై ఎలుగెత్తి ఆర్తనాదం చేసింది. అక్కడ స్నానానికై వచ్చిన వారిలోని ఒక స్త్రీ మూర్తి సాహసంతో ప్రవాహంలోనికి నుమికి చంద్రబాబును గట్టుకు సురక్షితంగా చేర్చింది. కాని అక్కడివారు ఆమెను గుర్తించేలోగానే ఆ ప్రదేశంనుండి తప్పుకొనిపోయింది.

"అవునండి! నన్నేం చేయమంటారు! అప్పటికి నాకు గుండెదడ తగ్గలేదు - బాబు అలా అయ్యేసరికి" అంది రమాదేవి.

"అవుననుకో! తాను అంత పెద్ద ప్రవాహాన్ని లెక్కచేయక ధైర్యంగా బిడ్డను రక్షించినా, కృతజ్ఞతనయినా పొందకపోయానని ఆమె ఎంత దూషిస్తున్నదో మనల్ని" అన్నాడు లక్ష్మీపతి.

"అయ్యో రాత! ఆమె అబ్బాయిని గట్టుకుచేర్చి గప్‌చిప్‌గా ఆ ప్రదేశంనుండి తొలిగిపోయింది"

"ఆ - ఎక్కడికీ పోయుండదు! నీవు సరిగా చూచుండవు."

"నిజమేనండి! ఏం చేయమంటారు! అలా బాబుని గట్టుకి చేర్చారో లేదో మా చుట్టు చాలామంది గుమిగూడారు. మరి ఆ మనిషినిగూర్చి భోగట్టాచేయడానికి వీలులేకపోయింది" అంది రమాదేవి.

"నీవు వెయ్యిచెప్పు! లక్ష చెప్పు! రమా! అది పొరపాటే! పెద్ద తప్పుగూడా!"

"సరేనండి! మనకు ఆమెనుగూర్చి తెలుసుకోవాలంటే విచారిద్దాం?"

"ఏలాగ! యింత పెద్ద పట్టణంలో

ఫలానా వ్యక్తి అని నిర్ణయించడానికి వీలు పడుతుందా!'' అని సందేహం వెలిబుచ్చాడు లక్ష్మీపతి.

''వార్తాపత్రికలో ప్రకటిస్తాం!'' అంది ఆమె.

ఇంతలో వంటింట్లోనుంచి అత్తగారు కేకేసేసరికి, భర్తవద్దనుండి వంటింట్లోనికి వెళ్ళింది.

◆ ◆ ◆

''నాకాశ్చర్యంగా వుంది! అక్కా! నీకు అంత ధైర్యసాహసాలు అప్పుడు ఎలా కలిగినవా'' అని అంది లీల.

అప్పటికే మాలతి చాలా అలిసిపోయింది. జవాబు చెప్పలేకపోయింది ఆయాసంవల్ల.

''మరి అంతచేసి పెద్దపొరపాటుచేశావు! కొంచం తడవైనా అక్కడవుండి రావలసింది'' అంది లీల.

''అబ్బా! చెల్లీ! అక్కడ ఒక్క క్షణమైనా వుండలేకపోయాను. ఆ చిట్టిబాబు సుందరవదనం చూస్తూంటే మన గోపాలు స్మృతికి వచ్చాడే! నా చిట్టి తండ్రి 3 సం॥ క్రితం ఆ మృత్యువాత బడకుంటే అంత వుండేవాడే. నా చిన్నారి చిట్టిబాబుకూడా అచ్చం అతని పోలికలో వున్నాడు. గోపాలుడి రూపరేఖలే అతనిలోగూడ కనుపిస్తున్నాయి. వయస్సుకూడ అంతే. అచ్చం అదేరూపం ప్రతిబింబంలా ప్రతిబింబిస్తున్నది. మనం మేలు చేశాననే ప్రచారం, ఖ్యాతి మనకెందుకు'' అంది మాలతి చెల్లెలు లీలతో.

''అదిగాక, వారేవరో గొప్పయింటివారు; మానమర్యాదలు గలిగినవారు'' అంది.

''అయితేనేం! వారికి తెలిస్తే తప్పేముంది? అంది పెంకిగా లీల.

''నీకు తెలియదు లీలా! వాళ్ళు మీజాతేం అని అడిగితే ఏమని జవాబిస్తావు?''

ఆ ప్రశ్నకు లీలనుండి జవాబురాలేదు.

◆ ◆ ◆

''మాలతీ! మాలతీ! ఇదుగో వార్తాపత్రిక! నిన్నటి దినం జరిగిన సంఘటనను ప్రచురించారు.''

''నిన్నటిదినం ఉదయం పట్టణ తూర్పుభాగంలోవున్న శ్రీ లక్ష్మీపతిగారి కుమారుడు చంద్రబాబు నదీ స్నానఘట్టంలో స్నానమాచరిస్తు ప్రమాదవశాత్తున నదిలో పడితే అక్కడవున్నవారిలో అంటరాని స్త్రీ 'మాల' అనే ఆమె అతన్ని రక్షించింది. ఆమె తమ బిడ్డను రక్షించినందుకు లక్ష్మీపతి దంపతులు ధన్యవాదాలర్పిస్తున్నారు'' అని వుంది. అది చదివి

చెప్పాడు నారాయణ—మాలతి భర్త.

అక్కడ చంద్రబాబు నాయనమ్మ ఆ వార్త చదివి ఉగ్రురాలైంది. "ఛీ! ఛీ! ఎంత అవమానం ఎంత కళంకం! మన మాన మర్యాదలు, ఆచారాలు మంట గలిసిపోయాయి. మన బాబుని ఒక కడ జాతి స్త్రీ ముట్టుకుందంటే ఎంత అపచారం! తక్షణం యాజ్ఞికులను పిలిపించి ప్రాయశ్చిత్తం చేయించండి." అంది లక్ష్మీపతితో ఆమె—తమబిడ్డకు ఆపద తప్పిందనే విషయం విస్మరించి.

లక్ష్మీపతిగాని, రమాదేవిగాని ఆమెకు నర్ది చెప్పడానికి ప్రయత్నించలేకపోయారు.

♦ ♦ ♦

"లీలా! నీవు వెళ్ళి తక్షణం జట్కా పిలుచుకురావమ్మా! మనం ఒకచోటికి వెళ్ళి రావాలి" అంది మాలతి ఒక దినం సాయంత్రం.

"ఎక్కడికే!

"చెబుతా! నీవు వెళ్ళిరా"

"ముందు చెప్పు."

"ఇక ఒక్క క్షణంకూడా ఆ బాబుని చూడకుండా వుండలేనే, ఆ దినం పొరపాటు చేసాను. ఆ నాబాబు ప్రతిరూపంలో వున్న ఆ బాబుని నేను తనివితీర మళ్లీ చూడాలని హృదయం పరితపిస్తున్నాది" అంది మాలతి.

"నిజమే! నీకు అలాంటి ఉద్దేశం గలిగివుండవచ్చు, వాళ్లు ఎక్కడుండేది నీకు తెలుసా?"

'ఆ! తెలుసు'

"ఎవరు చెపుదూ;"

"నిన్నటి పత్రికలోవుంది. పట్టణ తూర్పు ప్రాంతంలో వున్నారులే. నీవు వెళ్లి జట్కా పిలుచుకురా" అని చెల్లెల్ని పంపి, తను తగుమాత్రం సింగారించుకోను లోపలికి వెళ్ళింది మాలతి.

♦ ♦ ♦



ముస్తాబై యున్న పల్లెటూరి అల్లుని పట్నం ప్రయాణం

మాలతి, లీలావున్న జట్కా లక్ష్మీపతి గారి భవంతి ముందాగింది. అందులో నుండి లీల ముందు దిగి భవంతి ప్రాంగణం లోనికి వెళ్ళింది. చంద్రుడు వాకిట బంతి ఆడుతున్నవాడు జట్కాలో వచ్చినవారిని చూద్దామని జట్కావద్దకు పరుగెత్తుకు వచ్చాడు.

బండిలో కూర్చున్న మాలతే చంద్రబాబుని బండిలోనికి ఎత్తుకొని, తన వడిలోనికి తీసుకొని తన హృదయానికి హత్తుకుంది. ఆ మాతృ హృదయం తన కుమారుని మరణంవల్ల ఏర్పడిన గాయాన్ని, ఆ చిన్నారి పాపనుచూచి మాన్పుకోదలచింది. తనివితీరా ఆ బాబు ముద్దు మొహంపై ప్రేమ పూర్వకమైన ముద్దుల వర్షం కురుపించింది. ఆ ముద్దులకు చంద్రుడు వుక్కిరి బిక్కిరైపోయాడు. మొహం కందిపోయింది.

బండిదిగి చంద్రబాబుని ఎత్తుకొని ముందుగా లీలా నడుస్తుంటే మాలతి యింటి వరండాలోనికి అడుగుపెట్టింది. చంద్రునికోసం ఈవలకు వచ్చిన అతని నాయనమ్మ 'ఎవరని' ప్రశ్నించింది. ఫలానావారని వారలనడిగి తెలుసుకొని, "ఛీ! ఛీ! మా పిల్లవానిని ముట్టుకున్నది గాక ఏం మొహం పెట్టుకొని వచ్చారు. మానమర్యాదలు లేనివాళ్లు" అని కసిరింది.

వారు తన మనుమని ఆపదనుండి రక్షించి ప్రాణభిక్ష పెట్టినవారనే విషయం విస్మరించి తన్ను ఎంతో ఆదరిస్తారని, తమ బాబును తనివితీరా చూడవచ్చుని వచ్చిన మాలతికి, ఆమె మాటలు హృదయంపై సమ్మెట పోట్లుగా తగిలాయి. హృదయం అవమానంతో నిండిపోయింది. నిర్ఘాంతపడి నిలిచిపోయింది. ఆమెకు తెలియకనే చేతులలోనుండి బాబు జారిపోయాడు. పరుగు, పరుగునపోయి జట్కా ఎక్కింది. ఆమెతో పాటు లీల ఎక్కింది. లీల వడిలో చిన్నపిల్లలా వెక్కి వెక్కి ఏడుస్తూ పడిపోయింది మాలతి.




**ఆంధ్రాధ్యాపకము :** శ్రీ యస్. కృష్ణరావుగారు, కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, ఉస్మానియా యూనివర్సిటీ, హైదరాబాద్ (డక్కన్) వెల రు. 1-8-0.

తెలుగులో బోధనా పద్ధతులను వివరించుటకని రూపొందించబడినదీ గ్రంథము. ఇందులో గ్రంథకర్త అపార అనుభవ విశేషాలను వెల్లడిచేసే అనేక సూచనలు బహూళోపయుక్తములయినవి.

మాతృభాషకు సముచితస్థానము ఏర్పడుతున్న యీ రోజులలో ప్రజ్ఞావంతులైన ఉపాధ్యాయు లనిపించుకోడానికి భాషాజ్ఞానమేకాక బోధనా పద్ధతుల అక్కర సయితము అధికమయింది. మాతృభాషను సుబోధితంగా, విజ్ఞాన వికాసాలకు దోహదంగా చెయ్యడానికి గ్రంథకర్తబోటి అనుభవజ్ఞుల, విద్యావేత్తల కృషికి యీ గ్రంథరచన నిదర్శనము.

ఉపాధ్యాయ లోకం యీ గ్రంథమును స్వప్రయోజనలకు తద్వారా మాతృభాషా సేవకు వినియోగించుకోగలరని మా నమ్మకం.

**పూర్ణాహుతి** (శ్రీ పొట్టి శ్రీరాములుగారి జీవిత చరిత్ర) శ్రీ కె. సభా. ప్రచురణ కర్తలు ; భగవాన్ అండ్ కో., చిత్తూరు (ఆంధ్ర) వెల రు. 0-14-0.

ఉత్తమలక్ష్య సాధనకు అఖండత్యాగాలు చేసినవారు సర్వదా ఆరాధనామూర్తులు. అట్టివారి జీవిత చరిత్ర పవిత్రమైనదేకాక ఆదర్శనీయమైనదికూడాను. స్వజాతియొక్క శ్రేయస్సును, అభివృద్ధిని, ఉద్దేశించి ఆత్మార్పణము చేయుటకంటె అన్యమార్గములేదని నమ్మి తన ప్రాణాలనే అర్పించి ఆంధ్ర ప్రజానీకంలో నవ చైతన్యాన్ని రగుల్కొలిపి సత్వరాంధ్రరాష్ట్ర నిర్మాణమున కవకాశము కల్పించారు అమరజీవి శ్రీరాములు గారు. వారి జీవితచరిత్రను శ్రీ కె. సభాగారు గద్యరూపంలో గ్రంథంగా వెలువర్చారు. ఇది విద్యాలయాలలో సయితం పాఠ్యగ్రంథంగా నుండ నొప్పుచున్నది.

ఇందులో శైలి మనోజ్ఞానంగాను, భావరస ఔచిత్యమును పోషిస్తూ అనర్గళంగా సాగిన యీ రచన విశేష ఆదరాభిమానములకు పాత్రము కాగలదని మా విశ్వాసము

**పుష్పవల్లి** · విద్వాన్ కోగంటి దుర్గామల్లికార్జునరావుగారు, భారతీ సమితి' పామర్రు, కృష్ణజిల్లా. వెల రు. 0-8-0.

ఇది ఖండకావ్యముల సంపుటి. ఇందలి వస్తువు సామాన్య ప్రజానీకపు జీవితమునకు సంబంధించిన అనేక విషయాలు - నీతులు, భక్తి, జాతీయతల ప్రబోధంతోబాటు వినోద విజ్ఞానముల వ్యాప్తికుపకరించే రచనలు ప్రత్యేకతను కలిగించినవి. రచన సరళమై, అనర్గళముగాసాగి ప్రతివారు చదువతగినదిగా రూపొందించినందుకు గ్రంథకర్త అభినందనీయుడు.

# సంపాదకీయములు

## ప్రేమ, సహన, సద్భావాలు

ఇండియా వైస్ ప్రెసిడెంటు డా॥రాధాకృష్ణ గారు హైదరాబాదులో ఉపన్యసిస్తూ "ముందు ముందు తరాలను తీర్చి దిద్దే ప్రేమ, సహన, సద్భావములను మహిళలు అలవర్చుకోవాలి" అని ఉద్బోధించారు.

పురుషులతో స్త్రీలను పోల్చిచూచిన ప్రేమ, సహనములాంటివి మహిళలలో స్వభావ సిద్ధమయిన వయినా వాతావరణములో అనుదినం వస్తున్న మార్పుల దృష్ట్యా స్త్రీల మనస్తత్వముకూడ సహజత్వము కోల్పోవుచున్నదేమోననే తత్వశాస్త్రవేత్త శ్రీ రాధాకృష్ణగారు పై భావమును వెల్లడించియుంటారు.

ప్రేమ సహన, సద్భావములు ఒక్క స్త్రీలోనే కాదు — మొత్తం మానవ సమాజం అలవరచుకోవాలి; కాని స్త్రీలు స్వాభావికంగా అలవరచుకోడానికి గల అవకాశాలు ఎక్కువ. ఈ సందర్భమున భారత మహిళలు తమ విశిష్టతను కాపాడుకోడానికి తమ నైతికస్థాయి, ప్రతిష్ట భావితరాల వారికి ఆదర్శప్రాయం కావడానికి విశేషంగా బాధ్యత వహించవలసి యున్నది. ఇది జాతీయ శ్రేయోభివృద్ధులకు వాంఛ నీయము.

## ఆంధ్రరాష్ట్రంలో ఎన్నికలు.

ఆంధ్ర గవర్నర్ శ్రీ త్రివేదిగారు రాష్ట్రంలో స్వేచ్ఛావాతావరణంలో శాంతి భద్రతలకు భంగం కలుగకుండా ఎన్నికలు జరిపించడానికి చూపుతున్న ఆసక్తి అభినందించతగినది. కాని అక్కడక్కడ హింసా కాండ, అరాజక చర్యలు ఎన్నికల ప్రచార సందర్భమున ఆరంభమయినట్లు వార్తలు వస్తున్నవి.

ఏ రాజకీయవర్గమయినా సరే తమ అఘాయిత్యాన్ని, అమానుషత్వాన్ని ప్రదర్శించి ప్రజలలో భీతావహము, ఏవగింపు కలిగించేదానికంటె తమ పార్టీవిధానాలను, ఎన్నికల ప్రణాళికలను ప్రజల ఎదుటబెట్టి, మంచి చెడ్డలను గుర్తించే బాధ్యతను ప్రజలకే వదలడం మంచిది. ఏ రాజకీయవర్గ నాయకత్వము ఆంధ్రకు వాంఛ నీయమయిన దానినది స్వీకరించగలదు.

ప్రజల శ్రేయోభివృద్ధులకు దోహదమిచ్చి స్వాతంత్ర్యము, శాంతి సౌభాగ్యాలు ఏ వర్గపు నాయకత్వముక్రింద సురక్షితముగా నుండగలవో దానినే ప్రజలు ఎన్నుకోవలసి యున్నది.

## ఆవడి కాంగ్రెస్ మహాసభ

అఖిలభారత జాతీయ కాంగ్రెస్ మహాసభ యీ సారి దక్షిణ ఇండియాలో ఆవడిలో జరుగనుండుట సంతోషింపతగిన విషయము. సభాస్థలానికి సత్యమూర్తినగర్ గా నామకరణం చేయడం, ఆహ్వాన సంఘాధ్యక్షురాలుగా శ్రీమతి అంబుజమ్మాళ్ గారి నెన్నుకొనడం ఎంతైనను ఒప్పియున్నది.

శ్రీమతి అంబుజమ్మాళ్ మాజీ కాంగ్రెస్ మహాసభ అధ్యక్షుడు, గొప్ప మేధావి, జాతీయోద్యమంలో ధైర్యసాహసాలను, వ్యక్తిత్వమును ప్రదర్శించిన కీ. శే. యస్. శ్రీనివాస అయ్యంగారుగారి కుమార్తె. శ్రీమతి అంబుజమ్మాళ్ గాంధీజీ నాయకత్వముక్రింద జాతీయ కాంగ్రెస్ విధానాల ననుసరిస్తూ దేశసేవచేస్తూ వచ్చిన మహిళామణి.

ఆవడి కాంగ్రెస్ మహాసభ దేశంలోని జాతీయశక్తులను సమైక్యపరచి, ప్రజాసామాన్యంలో కాంగ్రెస్ నాయకత్వముపట్ల నమ్మకం పెంపొందించే విధానములను రూపొందించి, కాంగ్రెస్ నాయకత్వము మరింత పటిష్టమై జాతీయ సమస్యల పరిష్కారానికి మార్గదర్శక మగుగాక !

---

## శ్రీ జయనామ సం॥ర పౌష్య - మాఘమాసములు

| | | | |
|---|---|---|---|
| జనవరి నెల 1955 సం॥ | 16 | ఆ | అ 29.21 చి 21.13 రా 8.25 అమృతయోగం |
| | 17 | సో | న 33.53 స్వా 26.50 రా 14.4 |
| | 18 | మం | ద 38.43 విశా 32.46 రా 15.38 |
| | 19 | బు | ఏ 43.36 అనూ 38.47 రా 26.0 అమృతసిద్ధిః |
| | 20 | గు | ద్వా 48.17 జ్యే 44.38 త్యాజ్యాభావః కుంభాయ్నం, ప్రదోషభావః |
| | 21 | శు | త్ర 52.28 మూ 50.1 రా 17.25 అమృతయోగః |
| | 22 | శ | చతు 55.53 పూషా 54.41 దివ 15.47 మాసశివరాత్రిః |
| | 23 | ఆ | ● అమా 58.19 ఉషా 58.26 చతు 27.1 ది 15.49 |
| | | | **మాఘ మాసము** |
| | 24 | సో | శుద్ధపాడ్యమి 59-35 ది 8-43 అమృతసిద్ధయోగం, మాఘస్నానవ్రతారంభం |
| | 25 | మం | విదియ 59.36 త్ర 0.47 దివ 11.2 చంద్రోదయం |
| | 26 | బు | తృ 58.20 ధని 2.11 ది 20.17 |
| | 27 | గు | చ 55.46 శత 2.20 ది 18.3 దుంఢిగణపతివ్రతం |
| | 28 | శు | పం 52.2 పూభా 1.18 ది 24.33 |
| | 29 | శ | ష 46.53 రేవతి 56.4 ది 27.40 సుబ్రహ్మణ్యషష్ఠి |
| | 30 | ఆ | స 41.44 అశ్వ 52.21 రా 13.58 రథసప్తమి |
| | 31 | సో | అ 35-46 భ 47.56 దివ 14.29 భీష్మాష్టమి |
| ఫిబ్రవరి నెల 1955 సం॥ | 1 | మం | న 29.27 కృ 43-18 ది 15.32 |
| | 2 | బు | ద 23.8 రో 38.45 ది 20.12 దశమితిథిః |
| | 3 | గు | ఏ 17.4 మృ 34.30 రా 25.46 తిథిద్వయం, భీష్మైకాదశి |
| | 4 | శు | ద్వా 11.32 ఆర్ద్ర 30.56 రా 31.1 భీష్మద్వాదశి |
| | 5 | శ | త్ర 6.40 పున 28.3 శేష 3.16 |
| | 6 | ఆ | చతు 2.45 పుష్య 26-17 రా 29.22 |
| | 7 | సో | ○ పౌ 0.43 ఏష్యం 58.8 రా 27.18 వ్యాసపూజ, భారతీపూర్ణిమ |
| | 8 | మం | విదియ 57.49 మ 26.10 రా 18.6 మరణయోగం |
| | 9 | బు | తృ 58.57 పుఫ 27.54 రా 18.5 దగ్ధయోగం |
| | 10 | గు | చ 60.10 ఉఫ 3.50 రా 24.30 |
| | 11 | శు | చ 1.12 హ 34.47 రా 27.38 త్యా 4-19 |
| | 12 | శ | పం 4.21 చి 39.32 రా 26.0 హరిపదపుణ్యకాలం |
| | 13 | ఆ | ష 8.15 స్వా 45.8 త్యాజ్యాభావః |
| | 14 | సో | స 12-45 విశా 51.4 ది 0-22 |
| | 15 | మం | అ 17.33 అనూ 57.8 దివ 1.56 నవమితిథిః |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Founder : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.

